యెత్తఁబోయిన నిందిరేశుని యాజ్ఞ
నెత్తరాకున్నఁ బెల్లెసఁగుకోపమున
నత్తఱి మఱియు భృత్యాళితోఁ గూడి
యెత్తిన నెంతైన నెత్తరాకున్నఁ
గాలునిగతిఁ బరకాలుండు కినుక
నాలుకొనంగఁ గన్నులు జేవుఱింప
సద్దిరా యెంతమాయావి వీఁ డనుచు
గద్దించి కదసి ముంగలనున్న యట్టి

(891. ఆభరణవిషయికమంత్రికలనాదివర్ణనము.)

భూసురవేషి నంభోజసంభవుని
డాసికంఠమున ఖడ్గంబు దాఁకించి
యిటుచూచి యాపెట్టె యెత్తరాకుండ
మటుమాయలాడ నీమంత్రించినట్టి
మంత్రంబు మాని క్రమ్మఱ నెత్తవచ్చు
మంత్రంబు చెప్పెదో మఱియుఁ గొట్టుదునో
యన విని బెగడొంది యాపెండ్లియొజ్జ
యనియె నేర్పున ససహాయశూరునకుఁ
దానేమి యెఱుఁగ నోతండ్రి గుట్టంబు
మైనున్న యామహామాయావి కాని
యన విని యతని డాయఁగ నేగి యట్ల

(892. పరకాలయోగిప్రార్థనానుగుణమంత్రప్రదానము.
అష్టాక్షరమంత్రోపదేశవర్ణనము.)

యనిన రంగేశ్వరుం డలఁతినవ్వుచును
ఇప్పుడు నీకోరు నీమంత్రవరముఁ
జెప్పెద వేవేగఁ జేరర మ్మనుచుఁ

బరకాలు మస్తంబుపైఁ గేలు సాఁచి
కరమర్థి దక్షిణకర్ణంబులోన
భావింప సంసారభవవార్థి మునుఁగు
జీవుల నొకదరిఁ జేర్చునావనుచు
సనకసన్నుత మైన యష్టాక్షరంబు
నొనర సాంగంబుగా నుపదేశ మొసఁగి

( 693. భగవత్ప్రత్యక్షక్రమవర్ణనము. ఆదిదంపతిసౌందర్యాదిదర్శనము. )

యకలంకకంకణహారకేయూర
మకరకుండలయుతమహితవిగ్రహము
పంచాయుధోజ్జ్వలబాహుదండములఁ
బంచాస్త్రు మించినభావంబు గలిగి
తగ రమాగోదానితంబినీ సహితుఁ
డగుచు నంబుజనాయకారూఢుఁ డగుచు
నిజరూపధరులైన నిత్యులు ముక్త
లజశంకరాదులు నందంద కొలువ
నరుదారఁ బ్రత్యక్ష మగుచుఁ దన్మంత్ర
వరవాచ్యమైన దివ్యస్వరూపంబు

( 694. పరకాలయోగికృతదివ్యదంపతిసేవాప్రకారము. )

నతనికిఁ బొడచూప నాదివ్యమూర్తిఁ
బ్రతిలేని వేడుకం బరకాలయోగి
సేవించి యందునం జిక్కి సన్నుతులు
గావించి భావించి కడుసంతసించి
కన్నులవేడుకఁ గన్నీరు జాఱఁ
గ్రన్నన మైదీఁగ గఱుపారఁ జెలఁగి
ధరజాలతోఁగూడ ధన మెచ్చినట్లె
యరవిందనాభుఁ డీయష్టాక్షరమున

సవిభూతికముగ నిజస్వరూపంబుఁ
బ్రవిమలగతి నాకుఁ బ్రకటించె ననుచుఁ

( 895. ద్రవిడగాథావళీసమర్పణద్వారా అష్టోత్తరశతహరిమందిరసేవాప్రసంగము.
దశావతారవైభవము. సంసారతాపతప్తజీవరాశిదృష్టాంతవర్ణనము. )

బదిపద్యములఁ జెప్పి ప్రమదంబుతోడఁ
జదురుఁడై మఱి సాష్టశతధామపతులఁ
బంకజోదరులఁ దొంబదినూఱుపాట
సంకించి మఱి నూటయిరువదిపాట

సర్ణవశయను దశావతారముల
వర్ణించి యాతరువాతఁ బదింట
ఘనవిషజ్వాలలు గ్రక్కుసర్పంబు
నొనఁగూడి యొకయింట నుండుచందమునఁ
గడలినెన్నడుమ భగ్నంబైనయోడ
పడఁకుచుండెడి యోడవానిచందమున
వడిఁ గోసి పాఱుప్రవాహంబుచెంతఁ
బుడమినుండెడు మహాభూజంబుసరణి
నిడియుంగఁ దుదమొద తేర్చు కాష్ఠంబు
నడుమఁ జీమలపంక్తి నడికెడు కరణి

నెడపకపాఱు నట్టేటిలోఁ జిక్కి
కడుభీతి నొందు సృంగాలంబుభాతి
తాపత్రయోర్మిసంతతుల నేపారు
నాపూర్ణసంసార మనుపయోరాశి
లోలత మునిఁగి తేలుచు నున్న నన్నుఁ
బాలించి దరిఁజేర్చు పరమేశ! యనుచు
నీలీల నొప్పు వేయి న్నెనుబదియు
నాలుగుపాటల నవరసస్ఫూర్తి

నెక్కొని తనలోన నిండారి పొంగి
పెక్కసం బగుభక్తి వెలిమించె ననఁగ

( 896. ప్రబంధాంతరసమర్పణక్రమము. స్వార్జితవివిధైశ్వర్య సమర్పణక్రమము. )

సిరివరునకు మహాశ్రీవచనాఖ్యఁ
బరఁగుప్రబంధ మర్పణముఁ గావించి
మున్ను గైకొనినసొమ్ములు నంబరములు
నన్నియుఁ దెచ్చి శ్రీహరికి సిందిరకు
సకలభక్తులకు సమర్పించి పెక్కు
నుతులు గావింప సన్మునిలోకవిభుని
ఆరంగపతి మెచ్చి యాళ్వారు నపుడు
చేరంగఁ బిలిచి మచ్చికఁ గౌఁగిలించి

( 897. మురారిపూజాతారతమ్యక్రమవర్ణనము. )

యీవనజాత్మజుం డీశేంద్రముఖులుఁ
గావించుపూజలు గణుతించిచూడ
నీవు గావించు మన్నిజభక్తపూజ
కావగింజంతకు నవి యీడు గావు
కడపట యోగివర్గంబు నామీఁద
నుడుగక కావింపుచున్న యర్చనలు
యోజమై నీసేయుచున్న భాగవత
పూజతోడను సరిపోల్పఁగఁ దగునె?

( 898. వైకుంఠనాథకృతపరకాలయోగికైంకర్యప్రశంస. )
వరప్రదానసుముఖత్వనివేదనము.

భాగవతోత్తమ! పరమప్రపన్న!
యోగికులోత్తంస! యురుభక్తినిరత!
యనుచు నిర్జరముఖ్యు లాశ్చర్య మంద
జనులెల్ల నన్ను నేసరవిఁ గొల్చెదరో

యాలీల నినుఁగొల్తు రఖిల వైష్ణవులు
నీలీల మీరల నీపదువురను
గొలువనివాఁడు భక్తుండు గాఁడు మిమ్ముఁ
గొలిచినవాఁడె భక్తుఁడు మాకు ననుచు
వరమిచ్చి కడు గారవంబు దైవాఱఁ
బరకాలు నీక్షించి పలికె వెండియును
గ్రమమున నీచేతఁ గరుణతో నింక
నమితకైంకర్యంబు లవధరించెదము
అనుచు నానతి యిచ్చి యతనిఁ దోకొనుచుఁ
దనపురంబునకు నర్తితో నేగుదెంచి

( 699. హరిపదసేవాప్రకారము. శ్రీవేంకటాద్రివైభవకథనము. )

సిరితోడ నెనలేని సిరితోడఁ గూఢ
సురగేంద్రశాయియై యుండె నుండుటయుఁ
గొన్నిదినంబు లాకుసుమాస్త్రితంద్రి
చెన్నుఁ గన్నారంగ సేవింపుచుండె
నటుమీఁదఁ బరకాలుఁ డావేంకటాద్రి
కటకనివాసుని కథలుఁ జిత్రములు
సరసభావంబులుం జక్కందనములు
సిరులు నొయ్యారంబు చెలువంబు కలిమి
నటనలు నునికియు నయగారిపనలు
నటియింపు నీగి విన్నాణంపువగలు

( 700. శఠకోపాదిదివ్యసూరిప్రబంధార్థశ్రవణానందానుభవశైలి. నిజశిష్య
పరివారసహితపరకాలయోగి వేంకటాచలయాత్రాక్రమము. )

ప్రాయంబు నెఱి ప్రతాపంబు రాజసము
సోయగంబునుఁ గడుఁ జోద్యంబు గాఁగఁ
గొనకొని యలశఠకోపాదికృతులు
విని విని శ్రోత్రగా వేనోళ్ళఁ బొగడి

పలుమఱువిని నాగపతి శైలపతికి
వలచి యాతని జూడవలయు నటంచు
నలఘుమహానీంద్రుల యనుమతిఁ గూడఁ
జెలఁగి శ్రీరంగ రాజీవాక్షుచేత
ననిపించుకొని తడయక మున్ను గొలిచి
చనుదెంచు తనభృత్యజనమునుం దాను
సేవించువారి కిచ్చినదుర్జయములు
కావేరి కన నొప్పు కావేరి దాఁటి
శ్రీనిధి లోకవశీకరదేహు

( 701. నానానగరశైలవనాదిసంతరణక్రమము. )

శ్రీనివాసుని భక్తి సేవించుతమిని
నగరశైలములుఁ గాననసమూహములు
నగసంతతులుఁ బెక్కునదులును గడచి
యయనంబు నందు జాగరి రెండు మీఁదు
పయనంబు లవి యొక్కపయనంబు గాఁగ
నరుగుచుఁ గాంచికి ననతిదూరమున
నరవిందకోకబకాళులం బగుచు
మేలిమి చల్లదెమ్మెరలతో మింటి
పాలేరు నవ్వెడి పాలేరు చేరి
యెడగువ్వ తలచూపనీకుండ నుట్టి
పడు నెండవడి బెట్టువడిఁ దట్టుపడుచు

( 702. మార్గశ్రమహరణాదికథనము. )

శ్రమమార నానదీజలములఁ గ్రోలి
కొమరారునయ్యేటికరఁగట నొప్పు
పువ్వులనెత్తావిఁ బొదలుతేనియల
తువ్వరవడునెల్ల దోఁటలో నిలిచి

బడలి యోఁకటఁ జుట్టుపట్టులఁ బల్లె
బడుసర గానక పరగెడిత్రోవ
మఱిచూడ మిట్టాడు మానిసి లేక
మెఱయువేఁడిమి మిటమిట నెండ గాయఁ
దనయుఁ డాఁకలిగొనఁ దాఁ జూడలేని
జననికై వడి లోకజననీవిభుండు

( 703. కాంచీక్షేత్రనిలయాష్టభుజనామకహరిప్రసన్నత్వాదివర్ణనము. )
వృద్ధపురుషరూపావిర్భావము.

ఆవేళ శ్రీకాంచికాధీశుఁ డైన
భావజాతునితండ్రి భక్తవత్సలుఁడు
హరియష్టభుజకరుండును నృసింహుండు
కరుణించి భక్తునాఁకలిఁ దీర్పఁబూని
నరపగడ్డంబును నరములమెడయు
కరముప్రేలెడు పిడికడుజన్నిదములు
నొలయువెన్నెలనవ్వు నూర్ధ్వపుండ్రంబు
మలయునిగ్గుల తిరుమణివడంబులును
ప్రాలినబొమలు లోవంగినవీఁపు
ప్రేలాడుతోళ్లతో వెలయునెమ్మేను
నదరుడెందము లాలనసలారుచున్న
వదనంబు వడవడవడఁకునొదలయు
వదలుపింజల నిడువాలుధోవతియు
నొదవిన వలకేలియూఁతకోలయును
బోలఁగాఁ జుట్టినపొత్తిపాగయును
దూలగట్టిన వెడతోఁపుపచ్చడము
నంకెడా కేలిపంచాంగంబు ముష్టి
చంక ప్రేలెడుతాళి చలిదిమూటయును

దగనలవడఁ జేరి తనుజూచువారు
మొగిద్వాపరమునాఁటి ముసలి వీఁ డనఁగఁ
దడబాటు నడల నత్తఱి వచ్చివచ్చి
బడలినగతి గురుపదము లెన్నుచును
ఉరుభక్తి జెంతవా రొకయింత వినఁగ
నరవిలో ద్వయ మనుసంధించుకొనుచు
నిర్ధానురాగుఁడై యిట్లు భాగవత
వృద్ధభావముఁ దాల్చి వేదవేద్యుండు

( 704. పరకాలయోగికృతవృద్ధవైష్ణవపాదపూజాక్రమము. )

నాతోఁటలోనికి నరుదెంచి సుమిత
చూతంబుక్రింద నిల్చుట విలోకించి
పరకాలుఁ డప్పు డాపరమవైష్ణవుని
చరణాబ్జముల చక్కఁ జాగిలి వ్రాలి
యలకేలిముష్టి పంచాంగంబు గాఁగ
దెలిసి నాకిప్పుడు తిథివారసరణి
దినయోగములు తేటతెల్లంబు గాఁగ
ననయంబుఁ బరికించి యానతీవలయుఁ
గడుదవ్వు నడచి యాఁకలిగొని యెండ
వడఁ జెంది నాఁడ దేవరదాసునకును

దిరిచి మీరిప్పుడు తెచ్చినచంక
చరిదిలో నింత ప్రసాదింపవలయు
నన నవ్వి యావైష్ణవాగ్రణి కరుణ
దనరార నాపరాంతకున కిట్లనియె

( 705. వృద్ధపురుషకథితతిథివారనక్షత్రశుభఫలత్త్వవర్ణనము. )

శ్రీవిష్ణువారంబు శ్రీవిష్ణుతార
శ్రీవిష్ణుతిథియు సందేహింపవలదు

వాకొన నీకు సర్వగ్రహంబులును
నేకాదశమునందె యొసగియున్నారు
వాకొననేల సర్వము భద్ర మింక
నీకోర్కు లీడేరు నీకోరినట్ల

పనుపడ నీకు నీభటులకుఁ జలిది
పెనువొందనేఁ బంచిపెట్టెద ననుచుఁ
దెలివెండిరేకుల తేటగిలించు
పొలుపారు ననుపోఁకపొత్తిలోపలను
సలలితదివ్యాతి సౌరభభూజ
ఫలచిత్రరుచులఁ జూపట్టె యెంతయును
నమృతాంశుమీఁది చాయల గేలికొనుచు
నమృతమయం బై నయట్టియాచలిది
పరికరములఁ బెనుపడునూరుగాయ
పరిమళంబుల వారిబడలిక ల్వోయ

( 708. వరదానసంతోషకథనాది. )

నమరవర్గమునకు నమృతంబుఁ బెట్టు
కమలాక్షుగతి హస్తకమలంబుఁ దోఁచికి
పరకాలునకు మున్ను భక్తి దైవాఱఁ
గరఁమున నొకపిడికడు బ్రసాదించి
కడమభద్భటులకుఁ గ్రమమేరుపడఁగఁ
పిడికెడు పిడికెడు పెట్టెఁ బెట్టుటయు
నలసుధారసపాను లైనదేవతల
తెలివి నందఱుఁ బరితృప్తులై రపుడు
పరకాలుఁ డలరి యా భక్తవత్సలుని
చరణపద్మములకుఁ జాగిలి మ్రొక్కి
యెయ్యది మీనాము మెందుండి యిటకు
నయ్యా! యేంచేసితి రానటిం దనఁగ

(707. హరిసల్లాపనక్రమము. నరసింహమూర్తికాతిరోధానప్రకారము.)

ననిశంబు కాంచికి నపరభాగమున
నునికిగా నెలకొని యుండుదు నేను
ననుసాష్టభుజకర నరసింహుఁ డందు
రనుచు నంతర్హితుం డయ్యె వాకరణిఁ
గని పరకాలుఁ డక్కజ మంది యితఁడు
ననుఁ బ్రోవవచ్చిన నలినలోచనుఁడు
కాని వేఱొక్కఁడు గాఁ డంచుఁ బొగడి
యానందబాష్పకలాత్ముఁడై పొంగి
కరుణ నాఁడై నయాఁకలి చూడలేక
యరుదెంచి నా కమృతాన్నంబు వెట్టెఁ

(708. పరకాలయోగికృతనరసింహసేవాప్రకారము.)

దననామ మగిడిన దయతోడ నవ్వి
భునుగ కెప్పుడు సాష్టభుజకరుఁ డైన
హతహేమకశిపుండ ననియె నేవేలు
పతఁడె పంచేషు పంచాయుధాబ్జములు
ధరియించి యసురడెందము విదారించి
శిరముఁ జేరిన నరసింహవిగ్రహుఁడు
నతఁడె శ్రీవామనుఁ డతఁడె విష్ణుండు
నతఁడె యాదిమకిటి యగువాఁడు నతఁడె
యతఁడె నాకులదైవ మనునర్థ మొదవఁ
బ్రతిలేని యొకపది పాటచేఁ బాడి

(709. కాంచీనగరవైభవవర్ణనము. శేషాచలయాత్రాకలనము.)
ఉత్తుంగవేంకటాచలారోహణక్రమము.

పయనంబుగతి కతిపయదినంబులకు
నయకరం బైన శేషాద్రిచెంగటికిఁ

జని సంతసించి యా శైలరాజంబుఁ
గని శ్రీనివాసునికరణిఁ జూపట్టి
నాయద్రిరాజంబు నారోహణంబు
సేయంగఁ జంకించి చిరభక్తిపరత
మొనయంగఁ దత్పాదమూలంబునందు
ననురక్తి దివసత్రయంబు వసింప

( 710. శ్రీవేంకటేశపాదాదిసౌందర్యవిశేషవర్ణనము. )

నాసర్వమయుఁడు శేషాచలేశ్వరుఁడు
దాసునిమదిలోనితాత్పర్య మెఱిఁగి
కనకాంఘ్రికింకిణీకనకజాలుండు
ఘనతరోజ్జ్వలదివ్యకనకచేలుండు
ధృతరత్నరుచిల్లరీదీపితహేతి
తతచిత్రమేఖలాదామాళిధారి
వరదానకటిదేశవర్ణితకరుఁడు
కరపల్లవాగ్రసంగతచక్రదరుఁడు
హారకేయూర భూషాదిధరుండు
చారుమౌక్తికకంఠ సరసకంధరుఁడు
తులసికాదామకౌస్తుభవిభాసితుఁడు
వలితవిగ్రహుఁడు శ్రీవత్సలాంఛనుఁడు
ఘటితాలమేలుమంగా వత్సతలుఁడు
కుటిల నీలాయతకుంతలోజ్జ్వలుఁడు
సరసిజపత్రవిశాలలోచనుఁడు
నిరుపమసాంక వనీరసేచనుఁడు
వరదరస్మితశోభివదనమండలుఁడు
మరకతమాణిక్య మకరకుండలుఁడు
ధారితరత్నచిత్రకలలాటుండు
నీరజమిత్రసన్నిభకిరీటుండు

( 711. శ్రీవేంకటేశప్రసన్నత్వకథనము. భక్తిపరవశసేవాప్రకారము. )

నగునట్టి శ్రీవేంకటాద్రినాయకుఁడు
జగదేకనాథుఁ డాశ్రితుకాలునకుఁ
బొడకట్టి తనకరముల మేను నిమిరి
వడదేర్చి లాలించి వరదుఁడై పలుక
నావేల్పువేల్పు రెప్పార్పక చూచి
భావించి సేవించి ప్రణుతి గావించి
యాదేవదేవుని యనుమతిఁ గూడ

( 712. శ్రీరంగరాజసేవాసక్తిక్రమము. సూరిసేవాప్రకారము. )

నాదండ శోభిల్లు నతనిమూర్తులను
సేవించి యాపరజిత్తు క్రమ్మఱను
వేవేగ శ్రీరంగవిభుని సేవింప

నరుగుచు సకలదేశాధినాయకులుఁ
గరమర్థి నిచ్చలుం గానుక లొసఁగు
వరసువర్ణాదిసువస్తువుల్గొనుచు

( 713. కావేరీమందిరనిర్మాణప్రకారాది. నానావిధశిల్పచాతుర్యరచన.
విశ్వకర్మనిర్మాణరీతిప్రదర్శనము. )

సరవి రంగమునకుఁ జనుదెంచె నప్పు
డావేల్పురాయని యడుగుదామరలు
సేవించి ప్రణమిల్లి చిరతరభక్తి
లలిమించు వేల్పు నీలపుచందరాల
నలుపారు నల్లసేనపుజంగరాల
నలఘువై భవముల నట రెండుసాల
ములును వంటిల్లును మొదలుగాఁ గలుగు

కావేరినిలయకైంకర్యంబు లాఱు
గావింతు ననుచు సంకల్పంబు చేసి

గట్టిగా సాలయుగ్మము మహాసనముఁ
గట్టించి నాల్గువకలుకోటఁ దీర్ప
సవరింప దొరఁకొనుసమయంబునందు
భువి నెన్నఁదగినశిల్పులు ననిశంబు
ఘనులైన మఱి తక్కఁ గలిగినమేటి
పనులవారల బడి పనులవారలును
పరువడిఁ దమతమపనులకు సమరి
దొరఁకొని సేయంగఁ దొడరున త్రఱిని

బలువుకొండలు రేకబడ నింత మలఁచి
యులువకట్టులువోసి యులు లోలి నాటి
పసలుమించఁగ సూత్ర పట్టినపగిది
విసువక గసివోటు వేయువారలును
గూటంబు లులులుఁ జేకొని యవలీల
గాటంపుకొండ లొక్కట వ్రీలి వ్రాల
ననయంబు వెఱఁ గంది యనిమిషశిల్పి
గని యోటువడుచుండ గనివోటు వైవఁ
గప్పుల దూలముల్ కంబాలు పలుద
చప్పటిరాలు నచ్చంబుజోడియలు

కదరికాద్వారశాఖలు కొణంగెలును
మొదలైన సంపాదములు చిత్రగతులఁ
బడి పనివాండ్రు నిబ్బరమున సన్న
బడియలుపూని సంభ్రమము రెట్టింప

( 714. జలాంతశిలాంతశోధనపూర్వకనిర్మాణస్థాపనక్రమము. )

లావునం గదిసి హేలల్ల యటంచు
మేపీది వడి బండ్లమీఁది కెత్తుచును
ఆరీతిఁ బోవనియట్టిదూలమ్ములు

చేరి మూఁకలు గట్టి చిట్టెలు గట్టి
మొగడిగరవముల హేలల్ల యనుచు
నగపడి యవి మోచి యరుదెంచి వారు

ధర జలాంతము శిలాంతముగ శోధించి
వరుసలోపల గుండ్రవక్త్రంబు సేసి
యినుము జల్లియు వైచి యెనయ గట్టించి
వసిబారి మాఁకున వడిఁ గూరుకొనుచుఁ
జప్పటి గావించి చదురపానంబు
నొప్పుగావించి మై నొక్కొక్కరాయి
వరుస నిల్పుచు రసవర్గంబుతోడ
బెరయించి యిట్టికెపెట్టజల్లియును
సందడి బొక్కలో సందుసందులను
దండడిగొనఁగ బెండడివేయువారు

పొందికలగు రాయి పొందించి వెరుక
సందుదూరకయుండ సంతన సేసి
సూత్రంబులు నాయశుద్ధులు నెఱిఁగి
చిత్రంబుగాఁ బనిఁ జేయించువారు
నగుచు నీగతిఁ గోటయంతయు గట్టి
తగనొక్కయెడ భూమిఁ ద్రవ్వి శోధింప

( 715. పరకాలయోగప్రాప్తిక్రమము. చింతాప్రకారాది. )

సందులో నొక్కగుహాంతరసీమ
నిందునిమైకాంతి నెల్లిదం బాడు
చెలువ మొందినయోగిశేఖరుండొప్పు
మలయుంగ యోగసమాధితో నుండ

నాలోకనము సేసి హరిదివ్యసాల
మీలీల యీతని యిరవుమై వచ్చె

నేమిసేయుదు నంచు నిచ్చఁ జింతించి
యామీఁద నొకయుపాయముఁ దలపోసి
యతనిఁ జేరఁగ నేగి యాపరకాలుఁ
డతిభక్తితోడ నిట్లనియె యోగీంద్ర !
పరిపూర్ణహృదయ ! యెప్పగిది నిచ్చటికి
నరుగుదెంచితిరి నా కానతీవలయు
నన విని యయ్యోగి యాయోగినాథుఁ
గనుఁగొని ప్రణమిల్లి క్రమ్మఱం బలికె

( 716. అష్టోత్తరశతదివ్యక్షేత్రనివాసిమధుసూదనమూర్తిసేవాక్రమము. )

యోగదృష్టిదర్శనశైలి.

నెనలేనికమలాలయేశ్వరు నూట
యెనుబదితిరుపతు లేను సేవించి
వచ్చి యిచ్చోఁ నిల్చి వనజాక్షుమీఁది
మచ్చిక యోగసమాధి నున్నాఁడఁ
గ్రమమున నిన్ను నేఁ గనుఁగొంటిఁ గానఁ
గమలాక్షు నిప్పుడ కన్నుయ ట్లయ్యె
నని యోగదృష్టిచే నాపరకాలు
నునికిఁ గన్గొని వెండియును జాఁగి మ్రొక్కి
మ్రొక్కినఁ బరకాలమునికులోత్తంసుఁ
డక్కజపడుచుండ నతని కిట్లనియెఁ

( 717. తుహినాద్రినరసింహసంభాషణక్రమము. )

దుహినాద్రిపై వరదుని నరసింహు
మహితాష్టబాహు నిర్మలగుహావాసి
వేడుకనీవు సేవించితే యతఁడు
తోడ మాటాడు భక్తులఁ గూడి యెపుడు
నన విని వెఱఁగంది యాయోగి మగుడ
ననియెఁ బ్రేముడిమీఱ నరిశమనున్నకు

నతఁడు నాతోఁ మాటలాడునా యనిన
నతఁడు నీతోఁ మాటలాడఁ డాపూట
యని యోగి తుహినాద్రి కనిచిననతఁడుఁ
జని హైమశైలాగ్రసదను నృసింహుఁ

( 718. హరిమందిరప్రాకారనిర్మాణాదిపూర్తీకరణవిషయకనరసింహాజ్ఞాప్రకారము. )

గని మ్రొక్కి మానవకరివైరి యపుడు
తనభక్తుమాట తథ్యము సేయవలసి
యాయోగితోఁ మాటలాడ నమ్మౌని
యాయింది రేశుఁ బోయకయుండె నంతఁ
బరకాలుఁ డాకట్టు ప్రాకార మెల్ల
సరుదారఁ గట్టించి యంతటిమీఁద
ముదము సఖిలమైన మూఁడవకోట
యదియునుంగట్టింప నాత్మఁదలంచి
యేమిసేయుదు నింక నీసాలమునకు
హేమంబు చాలంగ నెటనుండి వచ్చు

( 719. ధనసంపాదనవిషయకరహస్యాలోచనాక్రమము. )

నని తనయొద్ద డాయఁగఁ గొల్చియున్న
యనుపమమైన యేకాంగవీరులను
రాయదొంగలఁ జౌర్యరసికశేఖరుల
సొయిడం బిల్చి రహస్యంబునందుఁ
బన్ని యీమూఁడవ ప్రాసాదమింక
నెన్నిలాగులనైన నీడేర్పవలయు
నలవిమీఱిన దీనికై యిటమీఁద
బలువైనధనము సంపాదింపవలయుఁ
గాదిదొంగిలితేరఁ గలరె వేవేగ
మీచేత నగునె యిమ్మెయి విచారంబు ?

(720. చౌర్యకార్యప్రవీణవీరపురుషసామర్థ్యవర్ణనము.)

అన విని యనుచరు లావరాంతకున
కనిరి నేర్పులును సాహసములు మెఱయ
భావించిచూడ నీబంటులసత్త్వ
మీ వెఱుంగవె విను మిన్నియు నేల
వదలక మండలేశ్వరునైనఁ గాంచి
కొదుకక తెరువాటు గొట్టనోపుదుము
పగలు చూచినసొమ్ము పగలు తేఁగలము
మిగిలినకడిమినెమ్మెయిఁ దివ్వరాని
తాలములు గడియ లుద్ధతి మోప ప్రీలి
వ్రాలించు పెక్కైనబదనిక ల్గలవు

పాతాళమున నున్న బలువిధినైన
జాతిగాఁ జూపునంజనములు గలవు
మహి నెరునైన రిమ్మల నిద్రవుచ్చు
మహిమలం గలచొక్కుమందులుం గలవు
ఇత్తఱి నిరుచేయి నెఱుఁగరాకుండఁ
గత్తెరసొమ్ములు గత్తిరింపుదుము
ఇలలోన నొండొరు నెఱుఁగరాకుండఁ
గలయ నామడయైనఁ గన్నపెట్టుదుము
అని యిట్లు తమదు సాహసములు చెప్పి
యనిరి వెండియు శాత్రవాంతకుతోడఁ

(721. నాగపట్టణాలయస్థితకనకమయజైనబింబాపహరణోపాయకథనము.)

గడుచిత్రమై తూర్పుకడలికి చక్కఁ
బడమటి యీనాగపట్టణంబునను
అసమాన మగు పదియాఱువన్నియల
పసిఁడిచే జైనులు ప్రమదంబుతోడ

గొప్పగాఁ దమకులగురినిఁ జేయించి
యొప్పుగా నొకగుడియును సభేద్యముగఁ
గట్టించి యందు నొకసకంపుఁబ్రతిమఁ
బెట్టినా రేమి చెప్పెడిది! యాప్రతిమ
యబ్బెనా మన పనులన్నియుఁ దామె
గొబ్బున నీడేరుఁ గొదలేక యనినఁ

( 722. నాగపట్టణస్థబౌద్ధాచార్యనిలయప్రవేశము. కవాటోత్ఘాటనవిషయకచింతాది. )

గడు సంతసిలి పరకాలుఁ డాభటుల
నెడపక కౌఁగిట నిరియంగఁ జేర్చి
తాను వారలు సౌగతప్రకారములు
పూని వేవేగఁ దత్పురమున కరిగి
యచ్చట నున్న బౌద్ధాచార్యవసతిఁ
జొచ్చి యంతయుఁ బారజూఁచి యెల్లెడను
దలుపు వాకిలియును ద్వారబంధమును
దెలియరాకుండ నెంతే చిత్రగతుల
నడుకు లేకుండ నేకాండంబు గాఁగ
నొదవ సంతననేసి యున్న మాగుడికి

( 723. కనకమయజైనబింబవిషయకసల్లాపాది. )

నచ్చుగా లోని హేమమూర్తిఁ జూడ
వచ్చువారికిఁ గనవచ్చుమాత్రంబె
కడుఁ జిన్నసోరణ కంతగావించి
యడరంగఁ బరకాలుఁ డచ్చోటి కరిగి
యాలోనిబింబంబు నాక్రంతగుండ
నాలోకనము సేసి యాత్మఁ జింతించి
తనబంటులును దానుఁ దడయక వెడలి
చనుదెంచి యాపురస్థలి బెంకిఁ జేసి

యనుచరవర్గంబు ననురక్తిఁ బిలిచి
యనిమె నేకాంతంబునం దొక్కనాఁడు

( 724. అతివిస్మయకరజైనాలయభేదనవిషయకాలోచనాక్రమము. )

పోలింపఁ గుచ్చితములకెల్ల మిగుల
నాలయంబైన యీయాలయంబిప్డు
జేదెసఁ దుదమొద లెఱుఁగంగరాక
భేదింపరాక యభేద్యమైనదియుఁ
గటకటా! భూమిలోఁ గంటిమి కాని
యిటువంటిసదనంబు లెందైనఁ గలవె
యేపాపజాతి బా నిది చేసె నొక్కొ
చూపట్ట దింతయుఁ జూరవచ్చుత్రోవ
పనుపడునట్టి యుపాయ మింకేది
యనుచుఁ గొండొకతడ వాత్మఁ జింతించి

( 725. ద్వీపాంతరనివాసిశిల్పిరచితజైనాలయ చిత్రసూత్రనిర్మాణ ప్రస్తావము. )

క్రచ్చఱదీపాంతరంబున నుండి
వచ్చినయట్టి కువాడివడ్రంగి
యపగడంబైన యీయాలయం బిట్లు
సవరించె నని సహసవ గాఁగ వింటి
నే నెదురఁగఁగల నీసూత్రమహిమ
మానుగా నెఱిఁగి క్రమ్మఱ వత్తు ననుచు
నేవచ్చునందాఁక నిచ్చోట మీర
లేపయూవంతయే మొడపీడకుఁడని

( 726. ద్వీపాంతరగమనప్రస్తావము. )

ముదమునఁ దద్వీపమున కేగి యందుఁ
జదురులై పెనుసాధుచందంబుఁ బూని

సారెకు నచటి పంచాణంబువారిఁ
జేరి యయ్యో యని శిర మింత యూఁచి
కడుపెద్దదైన సౌగతహేమగురుని
గుడి చొచ్చి చోరులు గొంపోయి రకట!
యనుచుఁ గంసాలివా రనిశంబునం వినఁగ
ననుచుండుసమయంబునం దొక్కనాఁడు
ఆమేటిగుడిఁ గట్టినట్టి యాశిల్పి
యామాట విని వెఱఁ గంది పొక్కుచును

( 727. జైనమందిరశిఖరస్థసూత్రఖండనవాక్యకథనము. )

చిత్రమైనట్టి యాశిఖరంబుమీఁద
సూత్ర మేగతిఁ గాంచి చొచ్చెనో దొంగ

యన విని పరికాలుఁ డరయనివాని
యనువున నతని కిట్లనియె నవ్వుచును
జెలువార గుళ్ళకు శిఖరంబులందుఁ
గలవె సూత్రంబు లాగడములు గాక.
యన విని శిల్పి లేదనుకొట్లు శిఖర
మున నేనపో సూత్రమును నిల్పినాఁడ
నిరుచుట్లు శిఖరంబు నేడేడుమార్లు
తిరమొందఁ ద్రిప్పినఁ దివియంగవచ్చు
నన విని మోదించి యరిదండధరుఁడు
దని నిజభటుల కీచందంబు దెలిపి

( 728. జైనాలయశిఖరారోహణ ప్రస్తావము. )

పనిపడి యాయత్తపడి వారుఁ దాను
నొనఁగూడికా క్రఁమ్ము నొకనాఁటిరాత్రి
గ్రక్కున నరిగి సౌగతగురునిలయ
మెక్కి యాశిఖరంబు నేడేడుమార్లు

త్రిప్పినంతనె యది తెరలినం బట్టి
చప్పుడము సేయక జగతిపై డించి
యాలోనఁ దనచెలి యలిప్రాణనాథు
నాలోని కనిచిన నతఁ డేగి మఱియు
దడయక నంతరాంతరముల నిడిన
గడియలు బీగము ల్గదలింపలేక

( 729. ఆర్తినివారక హరిధ్యానాదిప్రకారము. )

యావిధం బెఱిఁగింప నరిదండధరుఁడు
శ్రీవరుఁ దలఁపులోఁ జేర్చి నుతించి
యరుదుమీఱంగ దశావతారములఁ
బరఁగిన శ్రీరంగభర్తపై యాన
నిడినంతలోన నయ్యనుపబీగములు
తడయక గడియలు తముదామె తెఱచెఁ
దెఱచి నమిగు లమోదించి యాబావ
మఱఁది నెన్న డుము నుమ్మలిక రెట్టింప
ననఁతి నవ్వుచు నిడుపగు పెద్దయినుప
గొలుసు గీల్కొలిపి యాకుహారంబువెంట

( 730. కనకమయజైనబేరస్వరూపకథనము. )

డించినఁ జక్కఁగా డిగ్గి యామేటి
కాంచనరచితసౌగతమూర్తిఁ జూడ
నాసరి మఱియు లోహంబున రాగి
సీసబిచ్చడములఁ జేసియున్నట్టి
సుగతబింబంబు లాశూరు డీక్షించి
బెగడొంది పలికె నభేద్యవిక్రముఁడ!
తముఁ జూడఁగా లోహతనువుల మరయఁ
దమవంకవచ్చు నాదాయంబు గలదె

యదివో కాంచనమయం బై నట్టిరూప
మదయతం డమ కిడినట్టియున్నంబు

( 731. శ్రీరంగనాథమందిరనిర్మాణపూర్తికై విషయకధనప్రాప్తిప్రస్తావము. )

కోమరార జైనులగురువు డా నచుచుఁ
దమనోరు గట్టి యంతయుఁ దానె తినును
దానినే గై కొమ్ము తడయక రత్న
మానిత భూషణమయ మైనదాని
ననినఁ దత్కనకబింబాప్త మైనట్టి
ఘనశక్తి బెగడి దిగ్గన మింటి కరిగె
పరకాలు సోదరిపని యంత బొద్ధ
గురు హేమబింబంబుఁ గొలుసునం గట్టి
కదలింప నాసన్నుఁ గని మీఁదివార
లది యందుకొని యంత నతని గ్రమ్మఱను
అలగొలుసునఁ దొంటియట్ల నెన్నడుమ
బలసి చేదుకొనంగఁ బరకాలుమఱదిఁ
తలదాఁటి చిక్కనఁ దనువు తచ్ఛిఖర
బిలము పట్టకయున్న బెనఁకువ సేయఁ

( 732. పరకాలయోగిచింతాప్రకారము. )

బరమభాగవతుఁ డాపరకాలుమఱఁది
యరిదండధరున కిట్లనియె నవ్వేళఁ
గనకచేలాంకుకై ంకర్య మీఁడేరె
ననుసంతసమునఁ గాయము వొంగెఁ దనకుఁ
బెలుమరు నింత నిర్బంధంబు సేయ
వలవదు శ్రీరంగవరదునిసేవ
మొన్ని చందముల నీడేరవలయు
నున్నవిచారంబు లొండేమి వలదు

తను మీఱ లిచట నిత్తఱి డించిపోవఁ
గనిన బాధలు మిమ్ముఁ గదిమి చెండాడి

( 733. హరికైంకర్య విఘ్నాచరణకథనము. )

కైంకర్యమునకు విఘ్నము సేయఁదలఁచు
రింకఁ గొంకఁగ నేల నిదె వేగ వచ్చె
పరయనర్థంబుఁ బ్రాణాభిమానములు
వరుసతో నేలినవారివిగానఁ
బతి నాకు శ్రీరంగఫణిరాజశాయి
యతనివే తనదుప్రాణాభిమానములు

పతికార్యమునకు నై ప్రాణంబు లొసఁగు
నతఁడు సద్గతిఁ గాంచునని యండ్రు బుధులు
ఒకగువ్వకై తను వొసఁగి రాసుతుండు

( 734. పరతత్త్వప్రాశస్త్యాదివిషయవర్ణనము. )

సకలలోకంబుల సన్నుతిఁ బడసెఁ
బరతత్త్వమునకుఁ గాఁ బ్రాణంబు లొసఁగ
నరయ నందుల భాగ్య మది చెప్ప నేల
తనతలఁ గొట్టి యిత్తఱి నుండనీక
కొనిపొండు వట్టిజాగులు మాని మీరు
అన విని పరకాలుఁడౌరౌర యనుచు
ననుజాతపతిమాట కందంద మెచ్చి
యోలి నోభాగవతోత్తంస ! నీవు
పోలింప నిహాపరంబులు చూఱఁగొంటి
వని వాలు గైకొని యతనికంఠంబుఁ
దునిమి యాశిరముఁ బొందుగ గేలఁ బూని

( 735. కనకమయజైనబింబశిబికారోహణకథనము. )

బలువైన యాజైనభర్మరూపంబు
బలువిడి నాగుడిపై నొయ్య డించి
పట్టిమంచపుఁ బెనుపల్లకిమీఁదఁ
బెట్టి ముసుం గిడి పెద్దయు నగచి
శవముఁ గైకొనిపోవుసరవి నామంచ
మవిరలబలవంతు లగువారు మోవఁ

దలలు వీడంగఁ గొందఱు రెండుగడలఁ
బలుదెఱంగులఁ బాడి పాడి శోకింపఁ
గొందఱు కాష్ఠము ల్గొని యేగుచుండఁ
గొంద ఱంగలము గైకొని చనుచుండ

( 736. పరకాలభృత్యకృతజైనబేరాపహరణము. )

నీరీతి భృత్యు లాహేమబింబంబు
దూరంబు గొనిపోవఁ దొఱఁగురక్తమున
మలయుచుఁ జేనున్న మఱది మస్తకము
కలయంగఁ జూచి రక్తముజాడపట్టి
పత్తురో యనుచు నవ్వలఁ బరకాలుఁ
డత్తఱిం గడుచట్ట మగుపొదలోన

నాతల డాఁచి హేమాకృతిఁ గొనుచు
నాతలఁ గడచి తా నరుగ నత్తఱిని
శ్రీరంగనాథుఁ డాశ్రితవత్సలుండు
కూరిమితోఁ దనకొఱకుఁ గా వచ్చి

( 737. పరకాలయోగిభక్తివిషయకాశ్చర్యప్రస్తావము. )

భక్తుఁడీకై వడిఁ బ్రాణంబు లొసఁగు
భక్తికి నాశ్చర్యపడి సంతసించి
కంటిరే నాభక్తు ఘనతరభక్తి

వింటికే యొండైన వివరించి మున్ను
అని నిత్యవరులతో నందంద బొగడి
వినతాతనూభవు వీక్షించి పలికె

నాకొఱ కిపుడు ప్రాణము లిచ్చినట్టి
సాకేశసుతుని వైష్ణవశిరోమణిని
బొందితో మస్తంబుఁ బొందుగా మగుడ

( 788. లోకోపకారరచనాపణాసము. )

పొందించి నీముఖాంబుజసుధాధార
నొనయించి ప్రాణంబు లొసఁగింపఁదోడి
కొనిరమ్ము వేగ సద్గురుభక్తినిరతు
నన జని విహగేంద్రుఁ డరియమునాఱ ది
తనువున మస్తమత్తటిఁ బొందుపఱచి
తనమహత్త్వము మహీస్థలిఁ గొనుపింప
ఘనతరామృతమూర్తి గాఁన నెంతయును

బొలుపారు నిజముఖాంబుజసుధారసముఁ
జిలికించి బ్రతికించి చెలఁగించి యతని
గురుభక్తి వేగఁ దోకొనివచ్చి రంగ
వరునిపాదములక్రేవల నిల్పెఁ బ్రేమ

( 789. కృష్ణపురిప్రాప్తిక్రమము. )

సరిదండధరుఁ డంత సాహేంమబోధ
గురుబింబ మీరీతిఁ గొనిపోయి పోయి
కడుబూర మరిగి చీఁకటివిరిచుక్క
పొడుచువేళకుఁ గృష్ణపురిఁ జేరవచ్చి
యనుచరముఖులకు ననిచె దూరంబు
ననుదెంచితిమి ప్రజ చాల నాకొనిరొ

బలువైన రేపటిపయనంబు సాగ
వలయు నేఁ డిచ్చోట వసియించు టొప్పు
దీనికై యందఱు దిట్టగాఁ గట్టి
పూని యొక్కెడ నిల్వఁ బోల దిచ్చోట
నుండరా దిఁకఁ దలాయొకదిక్కు చెదరి
యుండంగవలయు సూర్యుఁడు గ్రుంకుదనుక

( 740. జైనమతస్థకోపావేశకథనము. )

నని వేదబాహ్యమతాసక్తు డగుట
కనయంబుఁ గోపించి యాజ్ఞఁ గావించు
నడువున సౌగతవరమూర్తి రొంపి
మడియుండ నందు నుమ్మలి లోనఁ ద్రొక్కి
యనుచరవర్గంబు నాయూరిలోని
కనిచి తా నట నుండె నది చూచికొనుచు
నప్పు డామడి సేయు నాయూరికాఁపు
ముప్పిరిగొను పగ్గముల చుట్టతోడఁ
గ్రుచ్చిన మునికోల గొంగడిముసుఁగు
మచ్చల మచ్చల మట్టికాశయును
బలువైనకేలియంబటికుండ తనకు
నలవడ నడగొండ లననొప్పుచున్న
మీఁదైనయెద్దుల మెడకాడిమీఁద
గోఁచేరు వైచి నెక్కొని రొప్పికొనుచుఁ

( 741. పరకాలయోగివరాలోచనాప్రకారము. నదుపాయనిర్ణయము. )

జనుదెంచి యామడిచక్కి నాఁగేలు
పనుపడఁ గట్టి చొప్పడ దున్ననరుగ
నదిగని పరకాలుఁ డాత్మఁ జింతించి
యిది గానబడుఁ దున్ననిచ్చిన వీని

నని యంత నొక్కఁ డుపాయ మూహించి
యెనయ దున్నుచు నెదు రేతెంచువాని
నెడపక తిట్టుచు నెద్దుల మెడలు
విడిచి లో శంకలు విడిచి యిట్లనియె
దున్నినఁ జోళనాథునియాన నీవు
నిన్నాళ్ళు తేరసా మ్మిటు తిఁందగునె

( 742. మాన్యవిషయకప్రస్తావము. )

ప్రథమ వారలనెల్లఁ బ్రోచి మాతాత
గడియించినట్టి దీకాణాచి నేల
యన్యాయ మేటికి నడుగుము నాదు
మాన్యంబు గాని సామాన్యంబు గాదు
తుదిని యీ యూరను దొరకెడ్డి వేరె
మదిఁ గొంక కొండొరుమాన్య మీరీతి
దున్నెడిలా గెట్లు తొలఁగు నీపనులు
విన్నార మేల క్రొవ్వితి కాఁపువాఁడ
కేన మేటికిఁ గందిగి:జను గాఁపు
వానిని వేచ కెవ్వలఁ జవి గాద

యనుమాట నిజమయ్యె నని వాఁడుఁ దాను
ననయంబు గనిసి వా దడచి యామీఁ దఁ
దగవున కొప్పి యిద్దఱు నేగుదెంచి
తగవువారలతోడఁ దముపను లొన్నెఱిపి

( 743. సభాజనకలితవిచారణాప్రకారము. )

కట్టకానుక లిడి కడపట నిలువ
గట్టిగా నాకార్యగతి విచారించి
యలయున్న సభవార లాయిరువురను
బిలిచి పరాంతకుఁ బిలిచి యిట్లనిరి.

యరయంగ నీమాన్య మైనయందులకుఁ
బరగంగ సాక్షిసంబంధంబు గలదె
యనిన నెక్కడిసాక్షు లలనాఁడె పోయి
రనిన బత్రము గలదా యని యనిన
నదర మాతోటి యేడవ పెద్దతాత
కిడినపత్రము చెడ కిన్నాళ్ళదాఁక
దడుచు నుండంగఁ దామ్రశాసనమె
యనిన సత్యము సేయు మనఁ బరాంతకుఁడు

( 744. నిజాలోచనాప్రకారము. శౌరిసాక్షిపూర్వకసత్యప్రతిజ్ఞాచరణము. )

తావిష్ణునకు నేఁడుతరములవాఁటి
సేవకుఁ డనబుద్ధిఁ జింతించి యపుడు
తలఁప మాయేడవతాత యైనట్టి
పులకర్తృవామనాఖ్యుఁడు చెన్నుమిగులఁ
బుడమి తాఁ గొలుచునప్పుడు నేర్పుతోడ
గడియించి కై కొన్న కాణాచి నేల
తలఁపఁ దచ్చరణగోత్రమువాఁడ నేను
పలుమాట లేల తప్పదు శౌరిసాక్షి
యని సత్యమొనరించి యలవాని గెలిచి
జనులెల్లఁ దను వేయుసరణులఁ బొగడ

( 745. పూర్వస్థలప్రాప్తిప్రకారము. )

మునుపు దానున్న సమున్నతస్థలికిఁ
జనుదెంచె రవి యస్తశైలంబు డిగ్గ
నప్పుడాపురనాథుఁడగు నందసూనుఁ
డప్పాలుఁ బాలుఁ బాయస మారగించి
నంబిడగ్గరఁ బిల్చి నాదుభక్తుండు
పంబినయాఁకట బడలియున్నాఁడు

అతనికిఁ బాలుఁ బాయస మప్పములును
హితమతితోడ నీవిచ్చి రమ్మనిన
జానుగా వాని నర్చకుఁడు మస్తమునఁ
బూని తత్ప్రేరణంబునఁ గొనిపోయి
కేదారభూమిచక్కిన గాచియున్న
యాదేవనుతునకు నది యిచ్చుటయును
బరివారమును దానుఁ బరకాలుఁ డెంతె
పరిపూర్ణముగఁ బసాపడి సంతసించి

( 746. ద్రావిడభాషారూపదశపద్యగ్రథనసమర్పణక్రమము. )

త్రిదశేంద్రవంద్యుని దేవదేవేశుఁ
బదిపద్యములచేతఁ బ్రణుతిఁ గావించె
మడిలోని యలహేమమయవిగ్రహంబు
వెడలంగఁ దిగిచి వేవేగంబ కడిగి
మునురాత్రిఁ గొనివచ్చి మురువున మఱియుఁ
బనువడ మంచపుఁబల్లకిలోన
నీరవొందఁ బెట్టి మిన్నేరనేటేరి
దరిత్రోవ నరుగుచుం దన్మార్గమునకు
నరస నొప్పెడు శౌరిసదనంబులందు
నిరవొందఁ బగలెల్ల నీరీతి నిలిచి

( 747. మురారిప్రసాదస్వీకరణవర్ణనము. )

యాయాయిమార్గుల ననువొంద నుతులు
సేయుచు వెండియుఁ జీఁకటిపడిన
మునుబోలె పుత్తడి ముదిరూపు వేగఁ
గొనిపోవుచును దప్పగొని యేగుదెంచి
ఘనతరం బైన సంగమపురంబునకుఁ
జని ప్రొద్దుగ్రుంకెడిసమయంబునందు
నాపురవరనాథుఁ డై యొప్పుచున్న
శ్రీపతి యారగించినప్రసాదంబు

ననుచరసంయుతుం డై యారగించి
ననయంబు గార్క్యమ్మ నయ్యారిత్రోవఁ

( 748. హరికృతసహాయకార్యకథనము. )

దెలియక యాయూరితీర్థరిం గూర్మిఁ
బిలిపించి త్రోవఁ దెల్పెడువాని నొకని
ననుపుము సూర్యోదయం బై నదనక
ననిన వా డారీతి ననిపెద ననుచు
నరిగి మదోన్మత్తుం డై మఱచుటయు
నరిదండధరుఁ డంత నచ్చోటఁ గదలి
చనుచుండఁ దత్పురీశ్వరుఁ డై నయట్టి
వనజోదరుఁడు భక్తవత్సలుఁ డపుడు
బాణకృపాణచాపంబులునుభయ
తూణీరములుఁ దాల్చి తోడనే నడువఁ
దెలతెలవార నేతేర నామేటి
విలుకానిఁ బరకాలవిభుఁడు వీక్షించి

( 749. భగవదంతర్ధానప్రకారవర్ణనము. )

మెయ్యది నీనామ మెద్ది నీయునికి
యిమ్మెడ నాతోడ నెఱిఁగింపు మనిన
నరయంగ నను జగదభిరక్ష యండ్రు
పురుడింప సంగమపురితలవరిని
బూనిక మీ రొంటిఁ బోయెద రనుచుఁ
దోన యేనును మీవెంటఁ దోడువచ్చితిని
అనుచు నంతర్హితుం డై న డెందమున
ననయంబు వెఱఁగంది యాపరాంతకుఁడు

( 750. పరకాలయోగిసంతోషక్రమము. శ్రీరంగనగరప్రాప్తివర్ణనము. )
కనకమయబుద్ధవిగ్రహ ప్రాప్తధనవ్యయద్వారా హరిమందిర నిర్మాణప్రకారము.

ఆనందబాష్పంబు లడరంగఁ బొగడి
శ్రీనాథుఁ డని యిచ్చఁ జింతించి యెఱిఁగి
దశరథసుతుని నాతనిహృద్యపద్య
దశకంబుచేత నెంతయు సన్నుతించి
మునుకొని శ్రీరంగమున కేగుదెంచి
కొనివచ్చు నలబౌద్ధగురుమూర్తిలోన
గొనవ్రేలిమాత్రంబు గొట్టించి డాఁచి
ఘనమైన కాంచనగాత్ర మంతయును
నఱకించి కరఁగించి నాణెంబు సేసి
కొఱదీర మూఁడవకోటఁ గట్టింప

( 751. భక్తాంఘ్రిరేణునామకయోగికృతపుష్పకైంకర్యమహిమ. )

నాకాలమునను భక్తాంఘ్రిరేణుండు
శ్రీకాంతుఁ డైన యాశ్రీరంగపతికిఁ
దనరుప్రేముడి సుమదామకైంకర్య
మొనరింపుచుండెడి యొకమందిరంబు
చాయం బ్రహారంబు చనుదేరఁ జూచి
యాయెడఁ బరకాలు డాత్మ భావించి
కడఁది సూత్రంబుసంగతి సాల మిపుడు
నడిచాయవచ్చె వైష్ణవగృహంబునకు
వివరింప నితనినివేశ మిందులకుఁ
దివియకుండఁగరాదు తివియంగరాదు

( 752. భాగవతకైంకర్యవైభవాధిక్యవర్ణనము. )

కమలలోచనుని కైంకర్యంబుకంటెఁ
గమలేశుభక్తు కైంకర్యంబు ఘనము

వేసర కఱువదివేలేండ్లు భక్తి
నేసేత హరిపూజ సేయుటకంటె
నొకభాగవతునకు నొకమాఱు పూజ
యకలంకమతిఁ జేయ నదియు మిక్కుటము
అనుచు నేకతమున హరుఁడు పార్వతికి
నొనరఁ బద్మంబున నుపదేశ మొసఁగెఁ
గావునఁ బరమభాగవతగేహమున
కీవలఁ జుట్టిరానిత్తు నీకోట

( 753. హరిభక్తగేహావరణరూపప్రాకారనిర్మాణకథనము. పుష్పకైంకర్య నిరతత్వప్రశంస. )

యనుచు నావరణంబు నాగేహమునకు
ఘనతరావరణంబు గాఁగఁ గట్టించె
నావిధం బెల్లభక్తాంఘ్రిరేణుండు
భావించి వైష్ణవభక్తికి మెచ్చి
యిప్పు డీపరకాలుఁ డిట చేయునట్టి
యుపకారమునకుఁ బ్రత్యుపకారముగను
పెనుపొందఁగాఁ బిడ్డ పేరిడవలయు
ననిమహాని మది నెంచి యాత్మజుభాతి
యనిశంబు దామంబు లర్పించునట్టి
తనదుపువ్వులనారఁ దరగుకత్తికిని

( 754. పరకాలయోగికృత శ్రీరంగగోపురమహానసాదినిర్మాణము. )

అరిదండధరునామ మనువొందఁ బెట్టి
పరమానురక్తుఁడై పరకాలుఁ డంత
వరగోపురంబును వంటసాలయును
గరమర్థి గణజంబుఁ గట్టింపఁ దలఁచి
కలయ నాచార్యులఁ గాసీల నపుడు
బిలిపింప వారలు పెనుజన్నిదములు

చంకల శిల్పశాస్త్రములపుస్తకములు
వంకవోఁ జుట్టిన వలుదపాగలును
గోలదిరేఖలు వడిఁ గోసినయట్టి
మొలమించి వలకేలి యునుపకమ్మలును

( 755. నానావిధకైంకర్య పరిపూర్తిక్రమవర్ణనము. )

వలవడ శిల్పశాస్త్రాగమవేత్త
లలపరాంతకునకు హస్తము ల్మొగిచి
చేరువ నిలువ నీక్షించి భాగవత
పారిజాతంబు చొప్పడఁగ నిట్లనియె
నడుఁగక మీర లిన్నాళ్ళు ప్రయాస
పడితిరి శ్రీరంగఫణిశాయికొఱకుఁ
బడిన నేమయ్యె మీపడుపాటులెల్ల
నెడపక రంగేశుఁ డీడేర్పఁగలఁడు
ఒప్పగా మీధనం బొప్పింతు మీఁద
నప్పుగా గణజంబు నాగోపురంబు

( 756. శిల్పివరకృతనిజకైంకర్య స్వీకరణవిషయకప్రార్థన. )

ననువొంద రెండవయమ్మహానసము
నొనరించుఁ డని పల్కి యుడుగర లొసఁగ
వేవేగ వారు నవ్విధి నన్నిపనులుఁ
గావింతు మని యొప్పి క్రమ్మఱ వచ్చి
తమకు నీవలయునర్థము వేఁడునపుడు
తమకించి యందుఁ గొందఱు తమ్ముఁ జూచి
తమచేతికాసు లిందనుకను మెసవి
క్రమమున నీయూడిగములు సేసితిమి
అలవడఁ దముసేయునట్టియాపనులు
కొలుపలే వని యొప్పుగొనుటయు లేదు

( 757. నానావిధచిత్రరచనాసంయోజన రీతివర్ణనము. )

విదితంబుగా మాకు వెనకకు మీరు
మొదలపెట్టెడు లెక్క మొదలపెట్టించు
చేకొని యేముసేసినయందుఁ గడమ
లేకుండఁ జూచి పాలించు మోసామి
చప్పటికుముదంబు చదరపానంబు
కప్పుచూరులు కంబకాళ్ళు పద్మకము
నొగి మహాజగతియు నుపజగతియును
దగినగట్టను గపోతము సంతనయును
మొదలైన తమపని మొగములలోను
గొదవ చీమంత చేకూరకయుండ
నీసునం దవిలి డా రీరీతిఁ బనులు
చేసేతఁ దమచేతఁ జేయింపుచున్న

( 758. పరకాలయోగికృతశిల్పివిషయదయాప్రసారాది. )

కాసిడు తమకొక్క కాసిడు సరికి
జేసికి గొట్లాడి పెనఁగిచూచితిమి
అన విని పరకాలుఁ డాశిల్పివరులఁ
గనుఁగొని యెంతయుఁ గరుణ వాటించి
సారసభవముఖుల్ సవరింపలేని
శ్రీరంగవిభుసేవఁ జేయువీరలకు
వ్యర్థంబు మిగుల ననర్థంబు నైన
యర్థమిచ్చుట కొంత యని విచారించి

( 759. నావికాహ్వానప్రకారవర్ణనము. )

పరమార్థముగనింకఁ బరమార్థ మిచ్చు
టరయఁ బ్రత్యుపకార మనుచుఁ గావేరి
ఘనవేగమున రెండుగడ్డలుం జమరు
కొని పార నోకనావికుని రహస్యముగఁ

భిలిచి కాంచనములు పెక్కుగా నొసఁగి
యలవిమీఱినధనం బది తెమ్మటంచుఁ
గాసింపుచున్నయాకాసీల నెల్ల
నాసమ్మతమున నీనావ యెక్కించి
కొంచక నట్టేటఁ గొనిపోయి పుట్టి
ముంచి నీవిందిచే ముంచిరమ్మనుచు

( 760. పరకాలయోగికృతశిల్పిప్రముఖభక్తజనోపకారక్రమాలోచన. )

సమకట్టి తత్తకజనము వీక్షించి
క్రమమున మీకు నీఁగలధనం బెల్ల
సవరింతు లెక్కతో సవరి నయ్యేటి
యవల శ్రీనీపతీర్థాంతరంబునను
ఉరుతరనిక్షేప మున్నది తనది
వరుసతో నావెంట వచ్చెదరేని
యని వారి నందఱ నాపుట్టిమీఁద
ఘనమైన యొకయమూఁక గాఁగ నెక్కించి
తామున్నయవలికి దాఁటి కాసీల
నామహాసింధుమధ్యమున ముంపించి

( 761. హరిప్రార్థనాప్రకారము. సంసారసాగరతరణోపాయరూప ప్రపత్తికలనము. )
భక్తజనమోక్షప్రాప్తిక్రమవర్ణనము.

ముకుళితహస్తుఁడై మురవైరిఁ దలఁచి
సకలలోకేశ ! కంజదళాయతాక్ష !
భవదీయకైంకర్యపరులైన వీరి
భవముక్తులుగఁ జేసి పరమపదంబు
చేరునట్లుగఁ గృపసేయు మటంచుఁ
బారమార్థముగఁ బ్రపత్తిఁ గావింప

లోకంబులెల్ల నాలోకించుచుండ
నాకసంబున వచ్చి యాదివాహనులు
మక్కువ వారి విమానంబులందు
నెక్కించుకొని ముక్తి కేగి రంతటను

( 762. పరకాలయోగి కైంకర్యనిరతత్వ వర్ణనము, నాగపురిజైన బింబాదర్శనాశ్చర్యకథ. )

బరకాలయోగి యెప్పటియట్ల మగుడ
నరిగి తా రంగవిహారి కైయుండె
నట నాగపురిబౌద్ధు లాగుడిలోనఁ
బటుతర హేమబింబము లేకయున్నఁ
బొగులుచు నాశ్చర్యమును జెంది సదన
మెగువ బంగరుకుండ యెడయుటఁ జూచి
పడిసినరక్తంబువడువు నచ్చోటి
యడుగులఁ బొడఁగాంచి యాపీట నున్న
ఇల నీటిలోఁజాడ లెత్తంగఁ జాలు
తలవరులను బిల్చి తచ్ఛాయఁ జూప

( 763. చోరాగమనచిహ్నదర్శనప్రకారము. )

జలజ తోమర శంఖ చక్ర దంభోళి
హలచిహ్నితము లైన యరిదండధరుని
యడుగులఁ బొడ గాంచి యచ్చట కడమ
యడుగులు గని కడు నాశ్చర్య మంది
యలవి నల్వుఁడె యట నలవెన్నదొంగ
బలిను వాటించిన బలుదొంగ యనుచుఁ
గొలఁది కనుంగొని గుఱి వ్రాసి మఱియుఁ
గొలిచి చూచుచు జాడగూడ నెత్తుచును

( 764. చోరాగమనచిహ్నదర్శనోహాది ప్రస్తావము. )

శ్రీరంగపట్టణప్రాప్తిక్రమము.

గుడిపడమటఁ జోరకులు డిగినట్టి
నడువుఁ జూపుచు బౌద్ధవారంబు మునుపు

చోరులు సనినట్టిచొప్పు జూచుచును
బ్బోరున నటు పోయి పోయి యొక్కెడను
సుడిగాలి వాని నించుక మాసి మడుసు
పడియున్న నొండొరుఁ బరికించి కాంచి
గురులు వ్రాయుచు నడుగులు గొల్చుకొనుచుఁ
బెరచోటఁ జొప్పు దీపింప నెత్తుచును
ఘనమైనచట్టునం గానరాకున్న
బునుకగ వీపునఁ బారలియెత్తుచును
అలపరకాలుని యడుగని తెలిసి
బలువిడి శ్రీరంగపట్టణంబునకుఁ

( 765. కనకమయబుద్ధబింబాహరణ విషయక ప్రశ్నాది. )

జనుదెంచి యటనున్న శాత్రవాంతకుని
గని కోపమునను సౌగతు లిట్టు లనిరి
తెచ్చినతమవంశదేశికు మరల
నిచ్చెదో నొచ్చెదో యేమికావలయు
ననినఁ బరాంతకుఁ డాశ్చర్యపడుచుఁ
దనుగానివానిచందమున నిట్లనియె
నెచ్చటిమీగురుం డేటివాఁ డాతఁ
డెచ్చట నుండు నా కెఱిఁగింపుఁ డనిన
నలనాగపురి నున్న హైమబింబంబుఁ
దెలియవే చేచేతఁ దెచ్చిన దొంగ

అలవిరివారల నణ కించినట్లు
పులిమిపుచ్చిన నిన్నుఁ బోనీము నేఁడు
నడుగక మాసామ్మునకు నొప్పఁజెప్ప
వెడఁగ ! రాజ్యమువారు విన్న మాటాదవు
వలవదు చెడిపోవవలదు నీమనసు
కొలఁదిఁ జెప్పితిమి యీగొంటుబాగేల
యెడపక తమమూర్తి నిచ్చితివేని
తడవము నిను దాఁకి తలఁపము తుదిని
ఈవ తెచ్చితి వని యేబాసమైనఁ
గావించెదము నెంత కష్టమడ్డనను

కితవ ! నీవిటకు దొంగిలితెచ్చి తనుచు
నతివెతలకు నిల్చి యాడెద విపుడు
అని తనకొంగు చయ్యనఁ జుట్టిపట్టి
కొని పోవు మని కసిగుంపుఁ గావింపఁ
దన తెచ్చు టెఱిఁగి రిత్తటి నంచుఁ దెలిసి
యనిమె వారలతోడ నాపరాంతకుఁడు
పదర నేటికిఁ గొంగు పట్టంగవలదు
వదలుండ యది దొడ్డవారిచేఁ బడియె
నాసామ్ముఁ దెచ్చు టేనరయుదుం గాని
చేసేత నేను దెచ్చినవాఁడ గాను

( 766. బౌద్ధబింబచ్ఛేదనకార్యవిషయకప్రశ్నాది. )

ఎఱుఁగను నను మీర లీరీతిఁ బఱచు
టెఱిఁగిన యది గని యిట తెచ్చువారు
గ్రన్ననఁ బ్రతిమ భంగముసేయఁ జూతు
రెన్నిచందంబుల నీరంతు వలదు
ఫలమువారలలో కాక పనిమాలినట్టి

చలమువారలొ పట్టి జగజోలి యేల
పసిఁడి బాగేదిచెప్పిన బులుగునకుఁ
బసిఁడి నాచెప్పినపగిది నిచ్చినను
గైకొని యేఁ జటుకనవ్రేలు గడమ
కాకుండ మీకొప్పు గావింతు ననిన
జైనులామాటసూక్ష్మముగాన లేక
యూనినగురుభక్తి నొదవ నిట్లనిరి
ఈవడిగినవెల్ల నిచ్చెద మిప్పు
డివతలం బత్ర మిచ్చెదవేని జెప్పు
మన సమ్మతించెఁ బరాంతకుం డపుడు
ఘనులఁ గొందఱ సభగాఁ గూడఁబెట్టి
తనవారిపనులచందముఁ జెప్పి కొన్ని
దినములు గడు విడి తేటతెల్లముగ

( 767. పరకాలయోగిప్రదత్తపత్రరీతివర్ణనము. )

సమమాసతిథివారసరణి తేర్పఱచి
ప్రమదంబుతోడ శ్రీపరదండధరుఁడు
అమరజైనుల కిచ్చినట్టిపత్రంబు
క్రమమెట్టిదనిన మీగడువు నాఁటికిని
పిసిఁడి బాగేదిచెప్పిన పులుఁగునకుఁ
బసిఁడి నేఁ జెప్పినపగిది మీరొసఁగఁ
గైకొనితుదిఁ జటుకనవ్రేలుగడమ
గాకుండ మీకొప్పుగావింతుననుచు
స్వరుచిమయొడఁ బడిసవరించుపత్ర
మరయనిందుల పత్రహస్తునొప్పంబు

( 768. శ్రీరంగనాథసాక్షికరణప్రస్తావము. )

ఆరంగపతి సాక్షులగువారియొప్ప
మారంగపతియంచు నపుడు వ్రాయించి

యలపత్త్రమంది తానాసౌగతులకుఁ
జెలరేగియిచ్చె నిచ్చినబౌద్ధులపుడు
తమపురి కరిగి యాధనము గై కొనుచుఁ
గ్రమమొప్ప మిగిడి యాగడువునాఁటికిని
అరుదెంచి యీఁదగు నర్థంబు లొసఁగి
పరకాలు నిజగురుప్రతిమ వేఁడినను
మునుపు దాఁచినబౌద్ధముఖ్యుని బొందిఁ
గనుపట్టు నలచిటికెనవ్రేలు గొనుచు
నేతెంచి వారల కీవచ్చునంత
నాతతశోకార్తు లగుచు నెంతయును

( 769. జైనగణకోపావేశాదిప్రకారవర్ణనము. )

గనలిజైనులు పరకాలునిం జూచి
యనిరి నీమాట సత్యం బని నమ్మి
మునుప దొంగిలినసొమ్మును నీకు నుండ
ధనమిచ్చితిమి మంచితనమున మఱియు
నిచ్చిన తమగురు నీక యీవ్రేలు
దెచ్చి యీవచ్చె దేలెఱుఁగునం దమకు
నిదె మున్ను నీవు మా కిచ్చినపత్ర
మదె సాక్షు లున్నార లోగాములకును
అనినఁ బరాంతకుడనియె వారలకుఁ

( 770. పత్రప్రదర్శనప్రకారము. )

బనిలేని యీ వట్టిపలుమాట లేల
పన్ని నేనిచ్చిన పత్రంబులోన
నున్నచందంబున నొప్పింతు మీకుఁ
బదర కాపత్ర మీప్రబలముందరను
జదివించు డందు నేసరవినున్నదియు

నందు నున్నందుల కావగింజంత
చిందు సేసిన నోరసేసిన జైన
నినుమడిగా నిత్తు నిపుడు నీసొమ్ము
కినియక తగవునం గెలిచి కైకొనుఁడు
అనిన వా రాపత్ర మాసాక్షి వారు
వినుచుండ వడిఁ జదివింప వారలును
గైకొని తుదిఁ జిటికెనవ్రేలు కడమ
గాకుండ మీ కొప్పు గావింతు ననుచు
నా కులో నున్నది యంతియేకాని
యాకాంచనాకృతియంతయు మీకు
నొప్పింతు ననుట లేకుండుటం జేసి
తప్పు గైకొని పట్ట తగ వేది మీకు
నన విని తగవున హైన్యంబు నంది
చని సౌగతులు చోళజననాథుఁ గాంచి

( 771. చోళరాజకృతవిచారణాప్రకారము, మహాద్రోహదోషారోపణకథనము. )

తమ హేమగురుఁ బరాంతకుఁడు గైకొన్న
క్రమ మెఱింగించి వెగ్గలముగా లోనఁ
బరిధాన మీ నొడంబడిన భూవిభుఁడు
కర ముగ్రమునఁ బరకాలు రావించి
యేమోయి పరకాల! యింతయధర్మ
మీ మెయిం గావింప నిది నీకుఁ దగునె
యే నెంత చెప్పిన నిట్టి నీమోజ
మానకపోయితి మాటిమాటికిని
గుఱుతైన సౌగతగురుముఖ్యు నీతి
దొఱఁగి తెచ్చుట మహాద్రోహంబు గాదె
యన విని పరకాలుఁ డవనీశుతోడ
ననియె రాజని నిన్ను ననరాదుగాక

(772. పరకాలయోగికృతప్రత్యుత్తరరీతివర్ణనము.)

యాగమబాహ్యులరై యున్నయట్టి
సౌగతముఖుల నెక్కడఁ బొడఁగన్న
గతము సేయఁగఁ దగుఁ గాక భూపతికిఁ
బ్రతిఁ బెట్టి యవి తుదిఁ బాలింపఁ దగునె
మును త్రిపురాసురమోహార్థముగను
దనుజారి యట్టిమతంబుఁ గల్పించి
తుదిఁ దానె తన్మతస్థుల నెచ్చనీక
పదివేలవిధముల భంజింపవలయు

(773. పరకాలబుద్ధజనపరస్పరవాదాచరణప్రస్తావము.)
పరకాలయోగివిజయక్రమము.

నని యానతిచ్చినాఁ డటుగాని బౌద్ధ
జనగురుహారణంబు సలిపితి నేను
దోడరి యందులకు నాతోడ వాదింప
విడువుము బౌద్ధుల వెస నింపులోన
జాడతో నాగమసరణి వాదించి
యోడినవారల నొనరింపు మాజ్ఞ
యనిన భూవిభుఁడు పరాంతకబౌద్ధ
జనులతో వాదింప సమకట్టుటయును
బరకాలుఁ డప్పు డాపరవాదిబలము
నురుతరానంతవేదోక్తఖడ్గముల
నలినలిఁ జేసి యెంతయు వీఁగఁదోలి
గెలిచిన నరుదంది క్షితినాథుఁ డప్పు

(774. చోళరాజకృతనమస్కారసంమాననాదిక్రమము. జైనగణదండనరీతి.)
శ్రీరంగనగరప్రాప్తివర్ణనము.

డరిదండధరునకు నవనతుం డగుచుఁ
బరమవస్తువుల సంభావించి యపుడు

హీనవాదులఁ జేసి యెదిరించి నట్టి
జైనుల దండించి జగములు వొగడ
మక్కువ బరకాలు మదదంతిరాజు
నెక్కించి పురమెల్ల నేగించి పొగడి
యల పట్టభద్రున కెన్నిచిహ్నములు
గల వన్నిచిహ్నముల్ కడఁకమై నొసఁగి
యనిచినఁ బరకాలుఁ డారాజు వీడు
కొని రంగపురికి నేగుచునున్నతఱిని

(775. షణ్ముఖాంశభాసురసంబంధనామక శైవాచార్యకృతపరకాలయోగికవిత్వ-
బిరుదాసహిష్ణుత్వవర్ణనము. పరస్పరవాద ప్రస్తావము.)

ధరలోనఁ ద్రికవినా దనరినయట్టి
హరభక్తుఁ డగు షణ్ముఖాంశసంభవుఁడు
సమ్మదుం డనుపేరి శైవమతార్యుఁ
డమ్మహాత్మున కెదురై డాయవచ్చి
ధర నాశుమధురవిస్తారచిత్రముల
నిరవొందుకవిత కధీశ్వరుం డనుచు
గరమర్థి వాయిదకాంద్రముంగలిని
బిరుదుకాళియలచేఁ బెల్లునాదింపఁ
బలుదెఱంగులవానివజ్జనె తవణి
మలహరిథక్కాదిమహితవాద్యములు
వాయింప సమదంతివాహనారూఢుఁ
డై యేగుదెంచు నయ్యరిదండధరుని
గనుఁగొని తనయున్నఘనపురంబునకుఁ
జనుదేరవలయు నోసర్వజ్ఞ యిప్పు
డన విని పరకాలుఁ డనియె నాతనికి
వనజాతనేత్రునివాసంబు లేని

గ్రామంబుఁ జొర నరికల దొరకప్రతిన
యే మెట్లవచ్చెద మీపురంబునకు
నన విని త్రికవి యయ్యరిశమనునకు
ననియె ముందర మదీయం బైనవీటఁ

గలదు నారాయణాగార మీవేళఁ
గలియుగంబున నది కనుపట్టలేదు
రవివంశతిలకుండు రాముండు తొల్లి
యవనిరక్కసుల వేఁటాడుచు నచట

( 776. శైవవైష్ణవమతాచార్యపరస్పరవాదచాతుర్యక్రమవర్ణనము. )

నెలకొన్నకతమున నిఖిలలోకముల
నలవీడు రామవియత్పురం బనఁగఁ
బరగె నావుడు విని పరకాలుఁ డటకుఁ
గరమర్థి నడుగ వేడ్కల శైవగురుఁడు
సకలోపచారము లొనరించి యతని
యకలంకసామర్థ్య మరయంగఁ దలఁచి

ఘనతమై భువి సర్వకవితావిభుండ
ననిపించుకొను టెట్లు లైన నీ విపుడు
కడలిశంఖంబు లిక్కడకు రాఁ గవిత
యొడఁగూర్చి చేసినీకొప్పు నాబిరుద
మన విని పరకాలుఁ డాశైవగురుని
గనుఁగొన లేనవ్వ గనుగొర గదుర
నన్నేలినట్టి క్రొన్ననవిల్తు తండ్రి
సన్నిధిఁ గాని యే సవరింపఁ గవిత

( 777. పరకాలశిష్యకథితవాదిప్రతివాదితారతమ్యరీతివర్ణనము. )

నావుఁడుఁ బరకాలు నంచిన శిష్యుఁ
డీవేళ దేవరకే మింద రుండ

శ్రీపతికృపను నీశిష్యప్రశిష్యుఁ
డోపఁడే యీమందు నోడించుపనికిఁ
దుది వీని నేలినధూర్జటి వచ్చి
యెదిరిన నీవేల యేమె చాలుదుము
కొండతో దగరు డీకొనినచందమున
నండజాధిపుతోడ నహి పోరునట్లు
మఱి నభోమణిఁ గీటమణిఁ జంకసేయు
తెఱఁగున నీదైన తెఱఁ గెఱుంగమిని
గడుతామసుండైన కలన మీతోడఁ
దొడరె నింతియకాని తుది నెన్ని చూడ
నతనికి మీకును నంతరాంతరము
మఱి నెన్నఁచో హస్తిమశకాంతరంబ

( 778. హరిమూర్తిసంపాదనయత్నక్రమకథనము. )

యనిన శిష్యులఁ జూచి యాపరకాలుఁ
డనియె నెన్నిన మీర లంతటివార
లైన నీతనిగర్వ మడఁచుట కిప్పు
డేనేమి మీరేమి యీపురిలోన
వేచని యిందిరావిభునియావాస
మేచక్కి నుండునో యెఱిఁగిరం డనినఁ
బూనిక శిష్యు లాపురమెల్ల వెదకి
కానక పరకాలుఁ గాంచి యిట్లనిరి
వెదకితిమయ్య యీపీటమందునకు
వెదకినలేదయ్య విష్ణుమందిరము

( 779. పరకాలయోగదృష్టిప్రసారనిర్ధారితహరిమూర్తిస్థితిక్రమకథనము. )

అన విని పరకాలుఁ డాపురం బెల్లఁ
దనదివ్యయోగవిద్యాదృష్టిఁ జూచి

ముదుకగుల్లలలోన ముత్తియం బున్న
చదురునం జెక్కుపాషండులలోన
మకరకుండలధారు మదిఁబొదుకొలిపి
యొకవైష్ణవీమణియుడివోనికూర్మి
ననయంబు పాషండులగు తమవారు
గనకుండ దొంతులకడ నుట్టికుండ

ముద్దుగారెడు వెన్నముద్ద కృష్ణయ్యఁ
దద్దయుభక్తి వస్త్రముచుట్టి దాఁచి
పగలెల్ల వారిలోపలఁ దాను నొకతె
యగుచు వారాడినయట్ల యాడుచును

( 780. శ్రీకృష్ణస్వరూపవైభవము. )

దమవారు నిద్రించుతఱిఁ బుండరీక
విమలాక్షు మానులవిందు గోవిందు
సలిలితాంబువుల మజ్జనము నొనర్చి
ఫలపుష్పధూపదీపముల నర్పించి
తొంటిచందమున నందునిజవరాలి
చంటిపాపని నిడి సతతంబు నిట్లు

హరిభక్తిపరమతి యైన యాసాధ్వి
సరవి యంతయు మానసంబునఁ దెలిసి
వెలయంగఁ దనకన్నవిధము శిష్యులకుఁ
దెలిపి మీరి పుడు సందేహింప కరిగి
యలకృష్ణుతోఁగూడ నాకాంత నేను
బిలిచెద ననిచెప్పి పిలిచి తోతెందు
అన విని పరిజనులట్లకా కనుచుఁ
జని యటనున్న వైష్ణవిఁ జేరవచ్చి
కనుఁగొని యాపరకాలువాక్యములు
వినుపించి రమ్మన వెఱఁ గందికొనుచు

సతతంబు నీకలశములోనినంద
సుతు నర్చనముసేయుచొప్పు నాతలఁపు
నేనెఱుంగుదు గాని యింటిలోవారు
గాన రీగతి యెట్లు కనియెనో ఘనుఁడు
మానుగా నతఁడు నిర్మలుఁ డైనయోగి
కాని సామాన్యుండు గాఁడు భావింప
నావైష్ణవోత్తము నంఘ్రిపద్మములు
సేవించి యభిమతసిద్ధిఁ బొందెదను

( 781. వాసుదేవసాన్నిధ్యవైభవసంతోషప్రకారము. )

అని కుండలో నున్న యావాసుదేవుఁ
గొని మూర్తితోడ నక్కునఁ జేర్చికొనుచుఁ

గరమర్థితోఁబరకాలుసన్నిధికి
నరుదెంచి శ్రీకృష్ణు నతని చేనొసఁగి
ముదమున నడుగుదమ్ములమీఁద వ్రాలి
పదివేల తెఱఁగులఁ బ్రస్తుతింపుచును
ఆలోలసంసారమనుపయోరాశి
లోలత మునిఁగి తేలుచు నున్నదాసఁ
బరకాల! తావకపదపద్మభక్తి
తరణిచేతను నొక్కదరిఁ జేర్పు మనుఁడుఁ
బరమసంతుష్టుఁడై పరకాలుఁ డంతఁ
బరమకృపారసభరితగాఁ జేసి

( 782. పరకాలకృతసంబంధనామకశైవాచార్యవాదాహ్వానక్రియయు. )
చిత్రకావ్యముకుటబంధరచనాదిప్రకారము,
తత్సమర్పణరీతివర్ణనము.

చలము మొప్పిరిఁ గొన్నసంబంధుఁ జేరఁ
బిలిచి యప్పుడు ప్రతాపించి యిట్లనియెఁ

దలపోయ నాకవిత్వములోని మేలు
దలపోయ నీరమాధవుఁ డొందు దక్క
నెఱుఁగంగలేరు బ్రహ్మేంద్రాదులైన
నెఱిఁగిన నీమూర్తి యెఱుఁగంగ వలయు
ననుచుఁ గాళియభేది కభిముఖుం డగుచుఁ
దననేర్పు మెఱసి యెంతయుఁ జిత్రగతుల
నలశౌరిమీఁదట నంకితంబుగను
జలధిశంఖంబు లచ్చటికి నేతేరఁ

బదిమాట నొక్కప్రబంధంబుఁ జేసి
హృదయంబులోఁ గన్న యాశార్ఙ్గపాణి
ననువొంద నేఁడు ప్రత్యక్షంబు గంటి
ననునర్థములతోడ నలవడి యొప్పఁ
దగ ముకుటాఖ్యబంధంబుచే భేద్య
మగునట్టి చిత్రకావ్యముఁ బ్రకటింప

33. శైవాచార్యసంతోషప్రదర్శనాది. తత్కృతపరకాలయోగివైభవవర్ణనము. )
నిజాపరాధక్షమాపణప్రార్థనాక్రమము.

విని శైవగురు డంత నెఱుఁగంది పొగడి
కనుఁగవ బాష్పము ల్గడలుకొనంగ
నరిదండధరుని పాదాంబుజాతములఁ
గరమర్థి వ్రాలి మై గరుపాఱ నిలిచి

మురవైరి యవతారమూర్తిని నిన్నుఁ
బరుఁ డని తలపోసి పామరబుద్ధిఁ
దొడరిన యిమ్మహాద్రోహంబు నీవ
కడతేర్చి క్షమియించి కావవే తండ్రి!
యని పెక్కుభంగుల నభినుతి సేసి

(784. పరకాలయోగిప్రాప్తచతుష్కవిత్వబిరుదావళి, రాజసంమానాది.)
వాసుదేవసపర్యాక్రమవర్ణనము.

పెనుపొందఁ బరకాలుబిరుదుకాహళికఁ
గొని భూమిఁ ద్రికవులకును జతుష్కవుల
కును రాజ వనుచు నెక్కొనఁగఁ బూజింపఁ
గరము వేడుకఁ బరకాలుఁ డావేళఁ
గరమర్థి నతఁ డిచ్చుకనకాంబరముల

నలనందసుతునకు నర్పించి యచటి
కలధౌతమణిమయాగారంబునందు
వరవైభవముల నవ్వసుదేవతనయుఁ
దిరమొందు ప్రేమఁ బ్రతిష్ఠఁ గావించి
జనులెల్ల వినుతింప సంబంధు వీడు
కొని కవిశేఖరు ల్గొలిచి యేతేర
పరకాలు మిగుల సంభావించి రంగ
పురమున కనిచె నప్పుడు పరాంతకుఁడు
శ్రీరంగమున కేగి శ్రితకల్పతరువు
శ్రీరంగనాథుని సేవించి యంత

(785. శ్రీరంగక్షేత్రప్రాప్తిక్రమము. రంగనాథకైంకర్యప్రశంసాది.)

గట్టిగాఁ దా మున్ను గరశాసనములను
గట్టించినట్టిప్రాకారముల్ చూచి
నలువార నల్లసేనపుజంగరాల
నెలమి నీసాలంబు లేను గట్టింతు
నని విన్నవించి యే నట్ల యీడేర్చి
తనయంబుఁ గరుణించి యప్పుడ యేను
గట్టిగా మంచిబంగరునీలమణులఁ
గట్టింతు ననిన యాగతిన యీడేర్తు

నీరీతి విన్నపం బేలకో యపుడె
శ్రీరంగనాయక సేయలేనైతి

( 786. శ్రీరంగనాథప్రత్యక్షవైభవము. పరకాలయోగి భక్తిపారవశ్యప్రశంస.)
తత్కృతహరిమందిర నిర్మాణ కైంకర్య క్రమము.

నని భక్తిపరవశుం డగుచు శోకింప
ననయంబు మెచ్చి శ్రీహరిరంగవిభుఁడు
పరకాలునకు వేగఁబ్రత్యక్ష మగుచుఁ
బరమానురక్తితోఁ బలికె యోగీంద్ర!
పాటిమీఱిన భక్తిపరత నీకట్లు
కోట లెన్నినరాతికోటలేవయ్య!
వనజభవాదులు వాసవాదులును
దినకరచంద్రాదిదివిజులుం గూడి
నెట్టన జాతిమానికములు చరులఁ
గట్టిరాళులనెన్ని గట్టి రన్నియును
నీవు గట్టించుమన్నియలసాలముల
కానగింజంతకు నవి యీడు రావు
అనుచుఁ గౌఁగిటఁ జేర్చ నరిదండధరుఁడు
వినతుఁడై వేవేలవిధములఁ బొగడి
తనసేయువిజయమంతయు నేర్పుతోడఁ
దనదేవి కెఱిఁగించి తదనంతరంబ

( 787. పరకాల యోగికృత భద్రాశ్రమవాసక్రమము. భాగవతపూజావైభవాధిక్య కథనము.)

పరమేశుఁ డగురంగపతియనుమతిని
బరమవిరక్తుఁడై పత్నియుం దాను
నరిగి కురంగేశు నావాస మగుచుఁ
బరమపావన మైన భద్రాశ్రమమునఁ

దనరెండమున రంగధవుఁ బాదుకొల్పి
యనుపమయోగవిద్యాసక్తి నుండెఁ
గావున నెన్ని సంగతుల భాగవత
సేవ సేసినవాఁడె శ్రీవైష్ణవుండు
హరిపూజకంటె శ్రీహరిభక్తపూజ
పరికింప నధిక మెప్పాటున నైనఁ
బరకాలయోగి యాభద్రాశ్రమమున
నురుయోగసక్తుఁడై యుండె నేఁటికిని
నిఱాటి లోకములెల్ల మెచ్చఁజేసినవి
యాఱుకైంకర్యంబు లాఱుకబ్బములు

(788. పరకాలయోగిరచితద్రవిడభాషారూపగ్రంథచతుష్కరసగీతిగాంభీర్యాదివైభవము.)

నల మహాశ్రీవచనాభిధానమున
నలవడఁ గృతియందు నాదికావ్యంబు
తిరుపతులందు వర్తిలుభాగవతుల
యరయఁగాఁ గృతకృత్యు లనునర్థ మొదవ
నెనసి రెండవకృతి యిరువది పాట
దనరార ఘటియించె దంటకం బనఁగ
ఘనచిత్రకావ్యభాగస్థితి యనఁగ
ననువొందుచుండ మూఁడవప్రబంధంబు
తలఁప మహాతనుదళము లనంగ
నలరె నాలవకృతి యైదవకృతియు
ధరణి నెన్నఁగ నీదుదండకం బనఁగ
గర మొప్ప నాల్గవకావ్యంబు చేసెఁ
బరమపావనమైన పరకాలుచరిత
ధర నెవ్వరేని తద్భక్తిపూర్వముగ
వినిన వ్రాసినఁ జదివిన నుతించినను
దనర వారలకుఁ బ్రత్యక్షమౌ శౌరి

యకలంకసిద్ధులు నభిమతార్థములు
సకలసిద్ధులుఁ గరస్థలి నుండుననుచు

( 789. గ్రంథసమర్పణక్రమము. కవివంశమహిమ. )

నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్త సంతతికి
సంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమతాళ్ళపాకన్నయార్య
తనయు తిమ్మార్యనందనరత్నశుంభ
దనుపమ శ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ

( 790. నిజకవితాప్రశంస. సప్తమాశ్వాసనిగమనము.)

సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావధూలబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృతమైన పరమయోగివిలాసకృతిని
నతులితంబుగ సప్తమాశ్వాస మయ్యె.



# పరమయోగి విలాసము.

## అష్టమాశ్వాసము.



(791. శ్రీదేవీవైభవకథనము, శ్రీవేంకటేశస్మరణాది. శ్రీరంగరాజమహోత్సవాదివర్ణనము.)

[ ద్విపద ]

శ్రీశ్యామసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ! శ్రీవేంకటేశ!
మునిశాలికాసారముఖ్యభక్తాళి!
వనమాలి! యవధారువరదానశీలి!
జలధికన్యాముఖ్యజలజలోచనలఁ
గలసి విచిత్రవైభవము దీపింప
సంతతోత్సవములు జరగ శ్రీరంగ
కాంతుఁ డెంతయును బ్రకాశించుచుండె

నలపరాంకుశముఖ్యు లగుయోగివరులు
పలికిన దివ్యప్రబంధరత్నములు
వినుచువారల గారవింపుచు భక్త
జనపోషణైకదక్షత నుండె నంత

(792. వీరనారాయణాఖ్యాగ్రహారప్రాశస్త్యము. తన్నగరస్థభాగవతవైభవకథనము.)

విమలమైయొప్పు కావేరిచెంగటను
రమణమై వీరనారాయణం బనఁగఁ
గ్రామ మొప్పును శ్రుతిగ్రామప్రవీణు
లామహానగరంబునందు నుండుదురు
వీరనారాయణవిభుఁ డనుపేరి
శౌరితనూజుఁ డచ్చటఁ బెన్నుమిగులు

నమృతసంకాశంబు లైనతోయములఁ
గొమరారుసరసి యాకుఱఁగట వెలయుఁ
బరమభాగవతులు పరతత్త్వవిదులు
కరుణాపయోనిధుల్ కమనీయమతులు
నగణితవేదవేదాంగపారగులు
జగతీసురుల్ చతుస్సాహస్రసంఖ్య

( 793. ఈశ్వరభట్టాఖ్యవైష్ణవోత్తమస్థితికథనము, విష్వక్సేనముఖ్యసచివగణనాయకాంశ
భాసురశ్రీనాథమునియోగిప్రాదుర్భావము. తద్గానవిద్యాప్రశంసాది. )

నలవడియుండుదు రందుఁ బెంపార
నలరుశోట్టైకుప్పలం బాకులంబునను
అనఘుఁ డీశ్వరభట్టుఁ డనువైష్ణవునకు
ననుపమశౌరి సేనాధినాయకుని

యాదిమమంత్రి గజాస్యునియంశ
మాదటం బొడమి యోగాసక్తుఁ డగుచు
ననుపమ గానవిద్యా విచక్షణుఁడు
మునుకొని శ్రీనాథముని యనఁబరఁగి
తనసేయుగీతవిద్యకు నారదుండు
తనువున శుభ్రతం దాల్చియుండఁగను

( 794. తద్విద్యాభ్యాసక్రమము. యోగాచరణమహిమ. ప్రశ్నిగర్భాంశభాసుర
సత్పుత్రజననక్రమము. )

అఖిలకళావేత్తయై సొంపు మిగిలి
యఖిలేశు యోగవిద్యాప్రభావమున
దనరుధ్యానమునఁ బ్రత్యక్షంబ చేరి
కొని డెందమున నిడికొని యటమీఁద

నరయంగఁ బృశ్నిగర్భాంశ మైనట్టి
వరపుత్త్రునీశ్వరాహ్వయమౌనిఁ గాంచె

నతఁడు దానును గూడి యష్టాంగయోగ
చతురకేళీవిలాసములఁ దేలింప

( 795. నాథమునిపుత్రాఖ్యేశ్వరమునివరాష్టాంగయోగవృద్ధిప్రకారాది. )
పుణ్యతీర్థయాత్రావిషయకప్రార్థనాక్రమము.

సారసమందిరాసహితుఁడై నట్టి
నారాయణుండు ముందర వచ్చి నిల్చి
కనుఁగొని యొకకొంతకాలంబు చనఁగ
దనయుండు దాను నెంతయుఁ బ్రేమతోడ
నావీరనారాయణాధీశుఁడైన
శ్రీవరుననుమతి క్షితిమీఁదఁ గలుగు
హరిమందిరంబులు నచటితీర్థములుఁ
గరమర్థి సేవింపఁగాఁ గోరి కదలి
దనుజారిసదనతీర్థముల మూఁడేసి
దినములు నిలిచి వర్తించుచు నచటఁ

( 796. భూమిప్రదక్షిణయాత్రాద్వారా బృందావన-గోవర్ధనాదిపుణ్యస్థలప్రాప్తిక్రమము. )
శ్రీకృష్ణసేవాప్రకారము.

చెలువొందుమూర్తుల సేవించికొనుచుఁ
జెలఁగి భూమికిఁ బ్రదక్షిణము గావించి
కనకసారసజాత కమలాప్తజాతఁ
గనుఁగొని తత్తటాంగణసీమయందుఁ
బొలుచుగోవర్ధనపురి బాలకృష్ణు
జలజాక్షు దేవకీచంటిబిడ్డనిని
సేవించి భక్తి నాశ్రీకృష్ణుపూజఁ
గావించుకొని పెక్కుకాల మున్నంత
నరసఖుం డగువీరనారాయణేశ
హరి నారితో విరహము సైఁపలేక

( 797. వీరనారాయణాఖ్యహరికలితాజ్ఞాప్రకారము. )

కలలోన వచ్చి యక్కడ నున్న మాని
తిలకుల ననుజూడఁ దిగి రమ్మనిన
రమణతో వీరనారాయణపురికిఁ
గ్రమమున నయ్యోగిరాజు లేతెంచి
యసమానులై యుండి రటమీఁద కురుక
వసియించి యుండెడి వైష్ణవోత్తములు
అటఁ గొంద తే తెంచి యలపరాంకుశుని
పటుతరదివ్యప్రబంధంబులోనఁ

( 798. నాథమునిదర్శనక్రమము, దివ్యప్రబంధవైభవసేవనాది. )

బదిపాట వినుపింపఁ బదివేలగతుల
ముదమంది యానాథముని వారిఁ జూచి
యమృతపానోత్కృష్టమైన యీకావ్య
మమర నంతయు మీర లానతీవలయు
నావుఁ డీకృతి యోగినాయకోత్తముఁడు
కావించి కడుఁ బెక్కుకాలంబు సనిమెఁ
బరికింపఁగా నీప్రబంధంబు ముక్తి
కరమైనకతన లోకములోన మునుపు
యంతయుం బదివి నీయంతమాత్రంబె
యెంతయు ముక్తికి నేగుచుండుదురు
కావునఖిల మయ్యెఁ గడమవృత్తములు

( 799. నాథమునియోగికృతకురుకానగరప్రాప్తిక్రమము. )
ద్వాదశసహస్రావృత్తిదివ్యప్రబంధపఠనాదివృత్తాంతము.

రావయ్య ననిన నరసి నాథమౌని

కురుకకు సరిగి యామరుకేశుఁ గాంచి
వరభక్తిని మురవోపనిచింతక్రింద
నెలకొని శఠకోపనిజమూర్తిఁ గాన
వలయును హాయంబు వరుసఁ జింతించి
యెలమితో మధురకవీంద్రుండు మున్ను
పలికిన దివ్యప్రబంధ మంతయును

దాలిమితోడ నాఁడటం బదిరెండు
వేలుచందమున నావృత్తిగావింప

( 800. శఠకోపముని ప్రత్యక్షదర్శనక్రమము. పరమసంతోషప్రాప్తిప్రకారము. )
దివ్యప్రబంధార్థప్రకటనద్వారా లోకోపకారరచనాశైలి

దాకొన్న కరుణలొ దరువులు వెట్ట
నై కుఁఠముననుండి వచ్చి శఠారి
యతనికిఁ బ్రత్యక్ష మయ్యె నావేళ
నతిభక్తినిరతుఁడై యానాథమౌని
యానందబాష్పంబు లడర శఠారి
మౌనీంద్రపాదపద్మములమై వ్రాలి
వినుతింప నయ్యోగివిభుఁడు మోదించి
యనఘ నీవలసినయర్థంబు వేఁడు

మన విని ముకుళితహస్తుఁడై నాథ
ముని పల్కె శఠకోపమునివర్యతోడ
భవదీయదివ్యప్రబంధరత్నములు
నవముగా నీదాసునకుఁ బ్రసాదించి
యిది దొరఁకొని దేవ యే ప్రబంధములు
జదువువారలకు విచారింప నెంత
యాయువుం గలిగిన యన్నాళ్ళుజగతిఁ
బాయకయుండక నాపై ముక్తి గలుగ

పరముఁ బ్రసాదింప వలయు నావుడును
బరికింప నయ్యోగిపతి సంతసమున

( 801. దివ్యప్రబంధోపదేశక్రమవర్ణనము. )

జలజాక్షు నిజ మానసంబున నిల్పి
పొలుపార ద్వయమంత్రపూతంబు గాఁగఁ
దనదుదివ్యప్రబంధంబు లన్నియును
నొనర సార్థమ్ముగా నుపదేశ మొసఁగి
యావరంబును నిచ్చి యనురాగ మెసఁగ
నావేళఁ దనయున్నయచటికి నరిగె
నానాథమునినాథుఁ డాచింతక్రింద
నానవ్యకావ్యంబు లామోద మెసఁగ

( 802. వీరనారాయణహరికలితస్వప్నప్రత్యక్షవర్ణనము, )
నిజశిష్యవర్గోపదేశక్రమము.

వెలసి తానును దదావృత్తి గావింప
నలవీరనారాయణాధీశుఁ డైన
శౌరి స్వప్నంబునఁ జనుదెంచి మనము
గూరిమిఁ జోడుగూడి యిద్దఱము
నావృత్తిసేయుద మటకు రమ్మనిన
వేవేగ మరలి యావీటికి నరిగి
యాదేవుతోఁగూడ నాప్రబంధములు
సాదరభావుఁడై యావృత్తిఁ జేసి
దివిజగానమునఁ దద్దివ్యప్రబంధ
నివహంబు తాళమానితముగాఁ బాడి
తనశిష్యవరుల కందఱకు నాకృతులు
నొనర సవిధమున నుపదేశ మొసఁగె

( 803. గానవిద్యాప్రదర్శనప్రకారము. గానవైఖరీప్రశంస. )

నటుగాన నీద్రావిడాగమాంతములు
పటుగతిఁ దద్వంశపాలురచేత
వినుచుండు నెపుడు శ్రీవేంకటేశ్వరుఁడు
ననవేల వేయును నట నొక్కనాఁడు
మతివిశేషంబున మానవగాన
వతియు మానవగానవతియుఁ జర్చించి
తమగానవిద్యలతారతమ్యములు
గ్రమమేరుపడఁ జోళకాంతుముందరికిఁ
జనుదెంచి గానంబు సవరింపునపుడు
విని సభవారెల్ల విబుధగానంబు
దెలియక మనుజప్రతీతిగానంబు
సలిపెడువాని మెచ్చకయున్నఁ గనలి
దేవగానము సేయుతెలుఁగు వేవేగ
భూవిభుతోడ నప్పుడు విన్నవించెఁ

( 804. చోళరాజకృతసంమాననాదికథనము. )

దనవిద్య యెఱిఁగిన ధరలోన నాథ
ముని దక్కఁగాఁ బరమును తెలుంగుదురె
యన విని భూనాథుఁ డానాథమౌని
వినయ మేర్పడఁగ రావించి తా నరిగి
యనుపమసింహాసనాసీనుఁ జేసి
యనిమె వీరలపాటలందలిమేలు
దేవర విని వాడు దేర్పంగవలయు
నావుఁడు విని మానినాయకోత్తముఁడు
వెలయ వారలపాట విని దేవగీతి
సలిపెడి వాని మెచ్చఁగఁ జేసె నప్పుడు

(805. సామాజికసందేహోత్పత్తి కథనము. నిజతాళవిద్యాప్రకటనరీతి.)

సామాజికులు కొంత సందేహపడిన
నామాట విని నవ్వి యానాథమౌని
యాయెడఁ బంచలోహంబైనయట్టి
వేయుతాళములు వేవేగఁ దెప్పించి
యాయెడ నొక్కమాట న్నితాళములు
వాయించు మనుచు నావాద మాలించి

( 806. నిజనగర ప్రాప్తిక్రమము. దివ్యప్రబంధద్వయగానవిద్యాది శాస్త్రోపదేశక్రమము. )

తలకొని యొక్కొక్క తాళమిన్నేసి
పలములటంచుఁ జొప్పడఁగ జెప్పుటయు
సరియైన నరుదంది సభ్యులతోడ
ధరణీవిభుండు పాదములకు నెరగి
పరమవస్తువుల సంభావింపఁ దనదు
పురమున కరుదెంచి పొలుపు దెప్పించి
తగ జయత్సేనాంశధారియై యనఘుఁ
డగుపుండరీకాక్షుఁ డనుశిష్యునకును
సరవి కాళాంశసంజాతుఁడై భక్తి
నరుదారు కురుకేశుఁ డనుశిష్యునకును
ద్వయము దివ్యప్రబంధములు శాస్త్రములు
నయకరయోగవిద్యయును సాంగముగ
నేపార నుపదేశ మిచ్చె నిచ్చుటయు
నాపుండరీకాక్షుఁ డలఘుఁడై భవ్యుఁడు
తనశిష్యసమితికిం దత్ప్రబంధములు
ననుపనుగానవిద్యయుఁ బ్రసాదించి

( 807. నాథమునికృత వాసుదేవధ్యానాది. చోళరాజాగమనము. )

యంతరసాంతరహారి యైనట్టి
కంతుతండ్రిని గోపికామనోహరుని

యన్నాథముని మది ధ్యానంబు సేయు
చున్నయత్తఱిఁ జోళుఁ డొకనాఁడు కూర్మి
తనపట్టమహిషులుఁ దాను నేతెంచి
ననవిల్తుఁగురువీరనారాయణేశు
సేవించి పోవ నాక్షితిపాలవరుని
భావించి గోపికాభామలతోఁడ
నరుదెంచినట్టి శ్రీహరి యంచుఁ దలఁపఁ
బరువడి నాభూమిపాలునివెంటఁ
బురముఁ జొచ్చినదాఁకఁ జోవ డెందముల
నరుదంద నిజశిష్యు లామౌనిఁ జేరి
దేవ! మీ రిటకు నేతెంచినకార్య
మేవెర వది యానతిమ్ము నావుండు
నావల్లకీకమలాననాసహితుఁ
డై వచ్చు శ్రీకృష్ణుఁ డని విచారించి

( 803. శిష్యప్రశిష్యద్వారా ద్రావిడాగమ ప్రచారాదిక్రమము. )
నాథముని యోగాభ్యాస క్రమవర్ణనము.

వచ్చితి నన శిష్యవరులు మోదించి
రచ్చోట వీడ్కొని యానాథమౌని
మరలి వేగమె నిజమందిరంబునకు
నరుదెంచి సకలశిష్యావృతుం డగుచు
నీరీతి నేడునూఱేఁడులు గడపి
కూరిమిఁ దనశిష్యకులము నీక్షించి
ప్రీతిగాఁ శ్రీపుండరీకాక్షుఁ బిలిచి
యాతతద్రవిడవేదాంతశాస్త్రముల
వసుధ నెల్లెడలఁ బ్రవర్తింపు మనుచుఁ
గిసలయాధరుఁగురుకేశతారాఖ్యుఁ

గనుఁగొని యోగమార్గము నీవు పూని
యనయ మేమరక తదాసక్తి నుండు

( 809. సత్పుత్త్రావతార-వరప్రదానకథనము. )

మని కుమారునిఁ జూచి యనియె వెండియును
ఘనతరుం డై నీదుగర్భంబునందు
సరవి సింహాననాంశజుఁ డైనయట్టి
యురుతరయోగీంద్రుఁ డుదయింపఁగలఁడు
అతనికి యామునాహ్వయ మిడు మనుచు
నతిభక్తిఁ బుండరీకాక్షు సన్మౌని

నలకురుకేశతారాఖ్యునిం బిలిచి
యెలమి మీరిరువురు నిటమీఁదఁబోడము
తనపౌత్రునకుఁ గులోత్తమునకే మనుప
నొనర మీ కుపదేశ మొసఁగినయట్టి
యనుపమసకలరహస్యార్థవితతి
యును యోగమును గూడ నుపదేశ మిండు

( 810. యోగవైభవప్రశంస. శ్రీరామసీతాగమనదర్శనాదివృత్తాంతము. )

అని వారి నియమించి యట నొక్కనాఁడు
ననవిల్తుజనకు నన్నళినలోచనుని
సేవించి గానంబు సేయుచునున్న
నావేళ నిజపుత్త్రి యరిమురి వచ్చి

వినవె యిద్దఱు పెద్దవిండులఁ బూని
వనితతోఁ గూడ క్రేవల నొక్కకోఁతిఁ
బాయకుండఁగఁ దాట బంధించిపట్టి
యీయెడ మనయింటి కేతెంచి రనిన
నామానినియె సీత యాయిరువురును
రామసౌమిత్రు లారయ వారంబె

హనుమంతుఁ డనుచు నిజావాసమునకుఁ
జనుదెంచి వారి నచ్చటఁ గనుంగొనక
వెదకి వారలు వేరె వేరె యటంచుఁ
గొడుకుల యడుగుచుఁ గొంత దవ్వరిగి

( 811. పరమపురుషాగమనవిషయకాన్వేషణాది. )
నాథమునియోగిపరమపదప్రాప్తిక్రమము.

యొకకోడలును గాంచి యొక్కపూఁబోఁడి
యొకయిద్దలును గ్రోఁతియును గూడి యింత
నిపుడు వచ్చిరి గానరే యన్న వార
లపు డెవ్వరిని గానమన్న మోహించె
నదియొకారణముగ నటఁ బరంధాము
పదపట్టబద్ధుఁడై పరఁగె నమ్మౌని
యది విని తనుజాతుఁ డాశిష్యవరులు
గుదిగొన్నవగతోడ గుబ్బున వచ్చి

( 812. బ్రహ్మమేధసంస్కారాద్యౌర్ధ్వదైహికకార్యాచరణము. )
నాథమునియోగిశిష్య జనవైభవము.

యానాథమునివిగ్రహంబు సేవించి
యానాథసుతునిచే నాశిష్యవరులు
పొలుపుమీఱఁగ బ్రహ్మమేధసంస్కార
ములవరింపించి పర్యాయంబుతోడ
నుచితకృత్యంబుల నొనరఁ జేయించి
రచలుఁడై కురుకేశుఁ డనుశిష్యు డంత
గురుని సంస్కారంబు గాలిపినచోట
నిరవొంద నొకచిన్నయిల్లు గావించి
బాగుగా గురుపాదపద్మముల్ తలఁచి
యోగవిద్యాభ్యాస మొనరింపుచుండె

